





























గ్రహాంతరవాసులు డికాట్రిక్స్‌ని పట్టుకుంటారా? జినాన్‌కి ఏం జరుగుతుంది? వచ్చే సంచికలో తెలుసుకోండి.

# ఈ సంచికలో...



చందమామ సంపుటి: 62 నవంబర్ 2009 సంచిక: 11



















# స్ఫూర్తినిచ్చే విశేషాలు

ప్రియ మిత్రులారా!

మీరందరూ దీపావళిని ఆనందోత్సాహాలతో జరుపుకుని ఉంటారని భావిస్తున్నాం. శబ్దకాలుష్యం లేకుండా, అంటే-భయంకర శబ్దాలు పుట్టించే బాణాసంచా పేల్చకుండా దీపావళి వేడుకలు జరుపుకున్నారు కదూ? ఎందుకంటే-మన సంతోషం కోసం ఇతరులకు ఇబ్బంది కలిగించడం భావ్యం కాదని గ్రహించడం చాలా అవసరం! మీ అనుభవాలను తెలుసుకోవాలని ఉంది. తప్పక రాయండి.

ఈ నెల పద్నాలుగవ తేదీ భారత తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినం సందర్భంగా యేటా బాలల దినోత్సవం జరుపుకుంటున్నాం. పిల్లలంటే చాచా నెహ్రూకు వల్లమాలిన ప్రేమ. చందమామ ఇన్ని భాషలలో వెలువడడం ప్రచురణారంగంలోనే 'అపూర్వ విన్యాసం'గా కొనియాడిన చాచా నెహ్రూ మన ప్రియతమ నాయకుడు. నిత్యనూతనంగా సాగుతూన్న నిరంతర అభివృద్ధికి శాశ్వత స్ఫూర్తి ప్రదాతగా ఆయన భాసిస్తున్నారు! నవంబర్ 20వ తేదీని ఐక్యరాజ్య సమితి 'యూనివర్సల్ చిల్డ్రన్స్ డే'గా గుర్తించింది.

నూతన విషయాలను కనుగొనడం పట్ల ఆసక్తి కనబరచే వారిని ప్రోత్సహించడం కోసం ఐక్యరాజ్య సమితి నవంబర్ 9వ తేదీని 'వరల్డ్ ఇన్వెంటర్ డే'గా గుర్తించింది. ఇన్వెంటర్, హాలీవుడ్ నటి హెడీ లమర్ జన్మదినం ఇది. నిత్యం కొత్తకొత్త విషయాలను కనిపెట్టాలని ఉత్సాహపడే వారికి ఆమె ఓ చక్కని ఉదాహరణ. తన కొత్త ఆలోచనలకు రూపం ఇవ్వడానికి ఆమె అనుక్షణం ప్రయత్నించింది. ఆమె కనుగొన్న 'ది ఫ్రీక్వెన్సీ హాపింగ్ ప్రాసస్' అధునాతన మొబైల్ టెక్నాలజీ పురోగతికి ఎంతగానో దోహదం చేసింది. ఆ టెక్నాలజీ ఇప్పటికీ మన మొబైల్ ఫోన్లలో అంతర్భాగంగా కొనసాగుతోంది!

వరల్డ్ టెలివిజన్ ఫోరమ్ సంస్థాపన దినోత్సవాన్ని పురస్కరించుకుని ఐక్యరాజ్య సమితి నవంబర్ 21వ తేదీని 'వరల్డ్ టెలివిజన్ డే'గా ప్రకటించింది.

ముఖ్యమైన చారిత్రక ఘట్టాలను గుర్తు చేసుకోవడం, మనమూ గొప్ప విషయాలను సాధించడానికి స్ఫూర్తినిస్తాయి. అందుకే గతంలో నవంబర్ నెలలో జరిగిన కొన్ని ముఖ్యమైన విశేషాలను గురించి ఇక్కడ ప్రస్తావించాం. మన నిత్య జీవితంలో జరిగే విశేషాలను డైరీ రాయడం ఓ మంచి అలవాటు, వాటిని ఉత్తరోత్తరా చదివితే చాలా ఆసక్తికరంగా ఉంటాయి.

గత మాసం సంపాదకీయంలో జలవనరుల పరిరక్షణ గురించి ప్రస్తావించాం. మరి మీలో ఎందరు వాటిని ఆచరణలో పెడుతున్నారు? వాస్తవ జీవితంలో ఎదురైన అనుభవాలేమిటి? వాటిని గురించి మాకు రాయండి మరి!

-సంపాదకుడు




నవంబర్ 2009 Rs. 20/-
*Founded by* B. Nagi Reddi and Chakrapani


*Editor & Publisher :* Prashant Mulekar
*Associate Editor :* Sowmya Rajendran
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* T. Venkatesan
*Asst. Editor-Copy & Pre-Production :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designers :* B. Thirumal, K. Narendra
Sanjay B Thorat : *Head - Sales and Circulation*
CHANDAMAMA INDIA LTD.,
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Mobile +91 9821017787
email : sanjay.thorat@chandamama.com
Rajendra K Jadhav : *Asst. Manager - Circulation*
Mobile +91 9320565048
email : rajendra.jadhav@chandamama.com
*New Delhi :* Sushil Sharma, *Circulation Manager-North,* Mobile +91 99110 91022
CHANDAMAMA INDIA LTD.,
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* P. Murali, *Asst. Circulation Manager -Karnataka* , Mobile +91 94488 36952
CHANDAMAMA INDIA LTD., 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094, Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* Ananth Prakash, *Circulation Manager-East,* Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
*Ahmedabad :* Kalpesh Raval, *Sales Officer-Circulation* Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
*Chennai :* K. Ravishankar, *Sales Officer - Circulation,* Mobile +91 98414 00981
email : ravishankar.k@chandamama.com
*Content Head - Online :* Sowmya Bharadwaj
email : online@chandamama.com
*For Marketing Enquiries :*
email : marketing@chandamama.com
*Advertisement :*
email : sales@chandamama.com
*Subscription Queries:*
e-mail : subscription@chandamama.com
*Customer Cell :* A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
*Production Executive :* Panchakshari R Math
*Head Office :* CHANDAMAMA INDIA LTD.,
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com


Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, 2/513, Sundeep Avenue East, 2nd Main Road, Thiruvanmiyur, Chennai - 600 041. Editor : Prashant Mulekar


# పాఠకుల లేఖలు

ముఖచిత్రం విషయంలో పాఠకుల అభిప్రాయాలను మన్నించినందుకు ధన్యవాదాలు. కథల విషయంగా మాత్రం సంతృప్తి లేదు.

– *డి.ఎస్. శంకర్, వక్కలంక-533241*

ఆర్య, అనునిర్వ, జాతకకథలు, నవ్వులపువ్వులు, భయమెరుగని నలుగురు వంటి కథలు, వాటి బొమ్మలు పాఠకులను ఏ మాత్రం ఆకట్టుకునేలా లేవు. దక్షిణాదిన 'తెలుగు చందమామ' ప్రారంభించినప్పటి నుంచి అత్యున్నత స్థాయిలో కథలు, వాటికి తగిన బొమ్మలతో ఎంతో కాలంగా పాఠకులను అలరించింది. పాఠకులు కూడా ఆ స్థాయి కథలు, బొమ్మలకు అలవాటుపడి ఇప్పటి క్వాలిటీ తగ్గిన కథలకు, బొమ్మలకు అసంతృప్తిగా ఉన్నారు. ముందుగా 3 నెలల తర్వాత పాత పద్ధతిలో రామాయణం(పాత బొమ్మలు) కవర్‌పేజ్ డ్రాయింగ్‌తో ఈ నెల చందమామను తీసుకు వచ్చినందుకు మీకు మా కృతజ్ఞతలు. – *శివకుమార్, మచిలీపట్నం*

కాలంతో పాటు మనమూ మారాలి. కాని 'చందమామ' మారకూడదు. పాత పద్ధతిలో వచ్చే 'చందమామ' అంటేనే మాకిష్టం. గత ఐదు నెలలుగా పాఠకులు 'చందమామ'ను ఎంత వ్యతిరేకిస్తున్నా మీ వైఖరి మారటం లేదంటే మాకాశ్చర్యం వేస్తుంది.

– *బి. రాజేశ్వర మూర్తి, చిలకలపూడి, కృష్ణా జిల్లా-521002*

అరవై ఏళ్ళలో 'చందమామ'లో ఎన్నో మార్పులు చేసుకుంది. అయినా నీతి, నిజాయితీల్లో మార్పు రాలేదు. మంచి కథలు, బేతాళ కథలు, జానపద సీరియల్స్, నవ్వులు, క్రీడలు ఇలా అందరికి ఉపయోగపడే అంశాలను మరే పత్రిక అందించని ఎన్నెన్నో ఇతర శీర్షికలను అందిస్తున్నందుకు చాలా ఆనందంగా ఉంది.

– *పులిజాల రవీందర్ రావు, హైదరాబాద్*

## ఎస్ఎంఎస్ ద్వారా

కథలు బాగా లేవు. దయ్యాల కథలు కావాలి. –*శ్రావణి(ఆం.ప్ర.)*



మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.

# బాలల దినోత్సవం

## చిన్నారుల సంబరాలు



జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినమైన నవంబర్ 14వ తేదీన మన దేశంలో బాలల దినోత్సవం జరుపుకుంటామని మనకందరికీ తెలుసు. ప్రపంచంలోని ఇతర భాగాలలో బాలల దినోత్సవం ఎలా జరుపుకుంటారో మీకు తెలుసా? షంభాలా అందాలఅద్భుతరాజ్యంలో రాజు గారు ఏర్పాటు చేసే శిశరవిందులో బాలబాలికలే ముఖ్య అతిథులు. రాజుగారికి పిల్లలంటే వల్లమాలిన ఇష్టం. వాళ్ళను ఆనందింపజేయడానికి రకరకాల యుక్తులు ఉపయోగించేవాడు. ఒకసారి రాజభవనం అంతటికీ నీలం రంగు వేయించి, పిల్లలకు ఆకాశంలో విహరిస్తున్న అనుభూతిని కలిగించాడు. మరోసారి అన్ని వైపులా బ్రహ్మాండమైన అద్దాలను అమర్చి సూర్యుడు ప్రతిచోటా ఉండే అనుభూతిని కలిగించాడు. ఇంకోసారి మంత్రులు ఊరేగింపులో ప్రవేశిస్తుండగా వాళ్ళ తలపాగాల నుంచి పొగలు వెలువడేలా చేశాడు. పిల్లల్ని చూసేప్పుడల్లా రాజు పరమానందంతో మీసాలు మెలేస్తూ పెద్దగా నవ్వేవాడు. పిల్లలకు ఇష్టమైన తినుబండారాలు, విందులు, వినోదాలు, కానుకలు పుష్కలంగా సమకూర్చేవాడు.

రాత్రి కాగానే, రాజూ-రాణీ అందమైన గుర్రాలమీద భూమికి దిగివచ్చేవారు. పెద్దపెద్ద సంచులలో పిల్లలకు అద్భుతమైన కానుకలు తీసుకువచ్చేవారు. పిల్లలు నిద్రపోయేంత వరకు కాచుకుని వుండి ఆ తరవాత తాము వచ్చివెళ్ళిన విషయం పిల్లలకు తెలిసేలా వాళ్ళు తమ కోసం ఉంచిన ఆహారపానీయాలను కొద్ది కొద్దిగా రుచి చూసేవారు. కానుకలను ఉంచి వెళ్ళేవారు. ఉదయం లేవగానే పిల్లలు రాజ దంపతులు రంగురంగుల సంచీలలో ఉంచిన కానుకలను చూసుకుని తెగ సంబరపడేవారు. టిబెట్‌లోని షంభాలా జాతి జనులు బాలల దినోత్సవం జరుపుకునే విధానం ఇది!

దీన్ని చదువుతూంటే మీకు క్రిస్మస్ సందర్భంగా శాంతాక్లజ్ ఇచ్చే కానుకలు గుర్తుకు వస్తున్నాయి కదూ? బాలల దినోత్సవం వివిధ ప్రాంతాలలో విభిన్న రీతులలో జరుపుకోబడుతున్నది. ఇవన్నీ సూచించేది ఒకటే-బాలలకు ప్రతి రోజూ ముఖ్యమైనదే! అత్యంత ఉత్సాహప్రదమైనదే!

బాలబాలికలందరికీ బాలల దినోత్సవ శుభాకాంక్షలు!





# పూజారి నోటి నుంచి

ఒకానొకప్పుడు ఒక పూజారి పద్యాలు పాడుకుంటూ నడుస్తున్నాడు. పొలాల మధ్యగా వెళుతూన్న అతనికి ఉన్నట్టుండి నోట్లో ఏదో పడ్డట్టయింది. అది ఏమై ఉంటుంది అని ఎంత ఆలోచించినా అంతుచిక్కడం లేదు. ఎంత ప్రయత్నించినా బయటకు రాలేదు. దగ్గాడు. గాండ్రించి ఉమ్మాడు. ఇక ఇది పని కాదనుకుని నాలుకను వెళ్ళబెట్టి గొంతులోకి వేలును పోనిచ్చి వాంతి చేసుకోవడానికి ప్రయత్నిస్తూ కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. అతి ప్రయత్నం మీద నోటినుంచి ఏదో బయటకు వస్తూన్న భావన. దోసిలి పట్టి గట్టిగా ఉమ్మి, ఆ తరవాత కళ్ళు తెరిచి చూశాడు. దోసిట్లో నారాయణపక్షి ఈక! తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. ఇదెలా నా నోట్లోకి వెళ్ళింది భగవంతుడా అని ఆశ్చర్యపోయాడు.



ఎలా అయితేనేం కాళ్ళీడ్చుకుంటూ ఇల్లు చేరి చాపమీద చతికిలపడ్డాడు. మధ్యాహ్న భోజనానికి కూర్చున్నాడన్నమాటే గాని అతడి ఆలోచనలు మాత్రం ఎక్కడో ఉన్నాయి. ''దేన్ని గురించి అంత తీవ్రంగా ఆలోచిస్తున్నారు?'' అని అడిగింది భార్య. ఇక మరో మార్గం లేక జరిగినదంతా సవిస్తరంగా చెప్పాడు పూజారి.

ఆ సంగతి వినగానే భార్య పకపకా నవ్వుతూ, ''నా జీవితంలో ఇలాంటి వింత విషయం ఎప్పుడూ వినలేదండీ,'' అన్నది.

''ఈ సంగతి వేరెవ్వరికీ చెప్పొద్దు. నన్ను పిచ్చివాడనుకోగలరు,'' అని భార్యను హెచ్చరించాడు పూజారి.

అలాగేనంటూ భార్య తలూపింది. మంచి భార్యగనక భర్తకిచ్చిన మాటను నిలబెట్టుకోవాలనే నిర్ణయించింది.

మరునాడామె ఏదో పని మీద పెరట్లోకి వెళ్ళింది. ఆ సమయంలో పక్కింటావిడ వాళ్ళ తోటలోని చెట్లకు నీళ్ళు పడుతూండడం గమనించింది. పూజారి భార్యను చూడగానే పక్కింటావిడ, ''ఇలాంటి అద్భుతమైన గులాబీ

పువ్వును నీ జీవితంలో ఎప్పుడైనా చూశావా?'' అన్నది గొప్పగా తన తోటలోని ఒక పెద్ద గులాబీ పువ్వును చూపిస్తూ.

పూజారి భార్య తన పెరటిని ఒకసారి కలయ జూసింది. చెప్పుకోవడానికి ఒక్క పువ్వుకూడా కనిపించలేదు. మరి తన పరువేంకాను? ఆలో చనలో పడింది. ''ఆ.. గులాబీ పువ్వు కన్నా గొప్ప అద్భుతాలే చూశానులే... మనిషి నోట్లోంచి పక్షి ఈకలు రావడం నువ్వెప్పుడైనా చూశావా? నిన్న మా అయన నోట్లోంచి నారాయణపక్షి ఈక వచ్చింది, తెలుసా!'' అన్నది.

పొరుగింటావిడ వెళ్ళబెట్టిన నోరు మూయ కుండా, పూజారి భార్య ఆ తరవాత చెప్పిన విషయాలన్నీ ఏకాగ్రతతో విన్నది. పూజారి కడుపులో పెద్ద పెద్ద పక్షులు ఎగురుతూన్నట్టు ఊహించుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయింది.

ఆ రోజు సాయంకాలం పక్కింటావిడ వాకిట్లో కూర్చుని ఉండగా, ఆ గ్రామం రజకుడు అటుగా రావడం గమనించింది. వాడు వచ్చి ఆమెకు నమస్కరించి ఆ మాటా ఈ మాటా చెప్పి తన అప్పుల బాధల గురించి ఏకరువు పెట్టాడు. అంతా విన్న ఆమె, '' ఈ చిన్న ఊళ్ళో ఉంటూ ఇన్ని బాధలు అనుభవించడం దేనికి? పట్టణానికి వెళితే చేతినిండా పని దొరికి కష్టాలు తీరిపోతాయి కదా?'' అని సలహా ఇచ్చింది.

వాడు కష్టపడ్డం అంటే సుతరామూ ఇష్టం లేని పరమ సోమరి. ''ఆ... పోనిద్దురూ... పరిగెత్తి పాలు తాగడం కన్నా, నిలబడి నీళ్ళు తాగడం మేలు కదా! చేతిలో ఉన్న పక్షుల్ని వదిలేసి ఎగిరే వాటి కోసం పాకులాడ్డం దేనికి అమ్మగారూ!'' అన్నాడు పెద్ద వేదాంతిలా.

పక్షులు అనే మాట వినగానే పొరుగింటావిడ



ఎగిరి గంతేసినట్టు, ''పక్షుల గురించా మాట్లా డుతున్నావు. మన పూజారి గొంతులో నుంచి పక్షులు వస్తున్నాయట తెలుసా?'' అన్నది.

రజకుడి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. ఉతకవలసిన బట్టల విషయం కూడా మరిచి పోయి, ఆమె చెప్పినదంతా గుడ్లప్పగించి విన్నాడు. అవకాశం దొరికింది కదా అని పొరుగింటావిడ పూజారి కడుపులో పక్షుల గూటిని స్వయంగా చూసినంత సంబరంతో వివరించింది!

రజకుడు ఇంటికి వెళ్ళగానే ఈ వింత వార్తను భార్యాపిల్లలతో పంచుకోకుండా ఉండ లేకపోయాడు. అయితే తెల్లవారేసరికి పూజారి గొంతులో పక్షుల గురించిన వార్త ఊరు ఊరంతా వ్యాపించింది. ఏమాత్రం ఆసక్తి కనబరచని గ్రామాధికారి సైతం ఉదయం ఫలహారం తీసు కుంటూ, దీనిని గురించి చెబుతూ, ''ఒక్కొక్క సారి మైనాలూ, పిచ్చుకలూ సైతం నోటి నుంచి వెలువడుతాయి తెలుసా?'' అన్నాడు పిల్లలతో.

''మన సమస్యలను పరిష్కరించుకోవడానికి పూజారిని సక్రమంగా ఉపయోగించుకోవాలి,'' అని గ్రామాధికారి భార్య సూచననిచ్చింది. గ్రామాధికారి సాలోచనగా తల పంకించాడు. తలుచుకున్నప్పుడు కడుపులో నుంచి పక్షులను పుట్టించగల వ్యక్తి సామాన్యుడు కాడు కదా మరి!

వెంటనే గ్రామసభ సమావేశమయింది. తమ సమస్యలను పూజారి పరిష్కరించగలడని అందరూ ఏకగ్రీవంగా తీర్మానించారు. అందరూ కలిసి పూజారి ఇంటికి వెళ్ళి ఆయన సహాయం అర్థించాలని నిర్ణయించారు. వాళ్ళందరూ కలిసికట్టుగా వెళ్ళినప్పుడు పూజారి వేప పుల్లతో పళ్ళు తోముకుంటున్నాడు. అందరూ అతనికి చేతులెత్తి మొక్కారు. ఆ తరవాత, ''పక్షుల అధినేతవైన మహాత్మా! మీ మంత్రశక్తులను తిలకించడానికే మేమందరం వచ్చాం!'' అన్నారు ముక్తకంఠంతో.



''వీళ్ళు చెబుతున్న దేమిటి?'' అని పూజారి విస్తుపోయాడు.

గ్రామాధికారి ఒక అడుగు ముందుకు వచ్చి, ''అయ్యా, నోటి నుంచి పక్షులను తెప్పించగల మహానుభావుడివైన నువ్వు మన గ్రామంలోనే ఉన్నావని ఇన్నాళ్ళు మాకు తెలియదు. ఆ అద్భుతాన్ని చూడ్డానికే వచ్చాం,'' అన్నాడు.

దోసిట్లో పడ్డ పక్షి ఈక తన నోట్లోనుంచే వచ్చిందని తను భ్రమపడినవిషయానికి ఇంతగా రెక్కలు వచ్చిందని అతడు అప్పటికి గ్రహించాడు. వివరించడానికి ప్రయత్నించాడు గాని, ప్రజలు దాన్ని అంగీకరించడానికి తిరస్కరించారు. ''వినయం కారణంగానే మీరిలా చెబుతున్నారు!'' అని మెచ్చుకున్నారు. ఆ అద్భుతం చూడకుండా ఇక్కడి నుంచి కదలమని పట్టుబట్టారు. ఆఖరికి పూజారి కళ్ళను ఓసారి బాగా నులుముకుని, ''సరే, ఇంతగా అడుగుతున్నారు గనక తప్పదు. అయితే, తలపాగా ఉంటేనే నేనా అద్భుతం చేసి చూపగలను. లోపలికెళ్ళి దాన్ని తెచ్చుకుంటాను, అందుకు మీరు అనుమతించాలి,'' అన్నాడు.

ప్రజలు ఆనందాతిరేకంతో చేసిన హర్షధ్వానాలు ఆ ప్రాంతమంతా మారుమోగాయి.

పూజారి బాణంలా ఇంట్లోకి దూసుకెళ్ళి తలుపు వేసుకున్నాడు. ఎంతకూ తిరిగి రాలేదు. ఓర్పుతో కాచుకున్న ప్రజలకు నిరాశే ఎదురయింది. పూజారి పెరటి తలుపు తెరుచుకుని చడీచప్పుడు కాకుండా అడవిలోకి పారిపోయాడు. ప్రజలు సంచలనాత్మకమైన ఆ ఉదంతం గురించి మరిచిపోయేంత వరకు అక్కడే ఉండిపోయాడు!

## బేతాళ కథలు

# మూడు తలల రాక్షసుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, అచంచలమైన నీ పట్టుదల, దృఢచిత్తం, కఠోరశ్రమ అబ్బుర పరుస్తున్నాయి. ఏ శత్రువు మీద పగ సాధించడానికి నువ్విలా శ్రమపడుతున్నావో తెలియదు. అయినా, ఈ పట్టుదల కార్యం సాధించేంతవరకు ఇలాగే చెక్కు చెదరకుండా నిలబడుతుందా లేక మధ్యలోనే నీరుగారి పోతుందా అన్న సందేహం కూడా కలుగుతున్నది. ఎందుకంటే ఎవరి మనసు ఎప్పుడు ఎలా మారుతుందో చెప్పడం కష్టం. మానవులు చపల చిత్తులు. పరిస్థితులను బట్టి ఆలోచనలు మార్చుకుంటూ ఉంటారు. ఆగర్భశత్రువులు సైతం క్షణంలో మిత్రులుగా మారిపోతూ ఉంటారు. అప్పుడు పగ సాధించడానికి పడిన శ్రమ అంతా వృథా అయిపోతుంది.



నీకు తగు హెచ్చరికగా ఉండేందుకు ఒక రాక్షసుడికి జడుసుకుని హఠాత్తుగా తన మనసు మార్చుకున్న సింహభూపతి అనే రాజు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

వింధ్యగిరి రాజ్యం రాజు శివపద్ముడు ధర్మ ప్రభువు. ఆయన పరిపాలనలో రాజ్యం సుభిక్షమై, ప్రజలు సుఖ సంతోషాలతో జీవించసాగారు.

వింధ్యగిరికి సమీపాన నిశారణ్యం అనే దట్టమైన అడవి ఉండేది. ఆ అడవిలో అమూల్యమైన వనమూలికలు ఉండేవి. వాటి కోసం వింధ్యగిరి వైద్యులు తరచూ అడవికి వెళ్ళి వస్తుండేవారు. అటువంటిది ఉన్నట్టుండి నిశారణ్యంలోకి అతి భయంకరుడైన మూడు తలల రాక్షసుడు ఒకడు వచ్చి చేరాడనే వదంతులు వ్యాపించాయి. దాంతో వైద్యులు నిశారణ్యం దిశగా వెళ్ళడం మానుకున్నారు.

ఆ వదంతులు రాజు చెవిన కూడా పడ్డాయి. ఆయన సమర్థులైన వేగులు కొందరిని పిలిచి అందులోని నిజానిజాలు తెలుసుకుని రమ్మని పంపాడు. వెళ్ళిన వేగులు వారం రోజుల్లో తిరిగి వచ్చి, ''మహారాజా! నిశారణ్యంలో మూడు తలల రాక్షసుడు సంచరిస్తున్నమాట నిజం. మేము వాణ్ణి కళ్ళారా చూశాము,'' అని చెప్పారు.

నిజం తెలుసుకున్న శివపద్ముడు ఆ రాక్షసుడి పీడ విరగడ చేయడం ఎలాగా అని ఆలోచిస్తూ; ప్రస్తుతానికి నిశారణ్యం వైపు వెళ్ళవద్దని ప్రజలకు చాటింపు వేయించాడు.

అటువంటి పరిస్థితుల్లో వింధ్యగిరి రాజ్యంలో ఒక వింత వ్యాధి ప్రబలింది. ఊపిరి పీల్చడం కష్టమై పిల్లలూ, వృద్ధులూ మరణించసాగారు.

శివపద్ముడు ఆస్థాన వైద్యులను పిలిచి ఆ వ్యాధికి సత్వరం ఔషధం కనుగొనమని ఆదేశించాడు. వైద్యగ్రంథాలు పరిశీలించిన ఆస్థాన వైద్యులు, ''రాజా! ఈ వ్యాధికి అవసరమైన ఔషధం తయారు చేయడం కనుగొన్నాము. అయితే, అందుకు అవసరమైన నవసంజీవనీ మూలికలు నిశారణ్యంలో గాని దొరకవు. మూడు తలల రాక్షసుడు సంచరిస్తూ ఉండడం వల్ల మేమా ప్రాంతానికి వెళ్ళడం ప్రాణాంతకం కదా?'' అని భయం వ్యక్తం చేశారు. వాళ్ళ మాటల్లోని నిజం గ్రహించిన శివపద్ముడు



అప్పటికి మౌనం వహించాడు. కానీ రోజు రోజుకూ రాజ్యంలోని మరణాల సంఖ్య ఎక్కువ కావడంతో ఆయనెంతో వ్యధచెందాడు. దానిని గురించి బాగా ఆలోచించిన శివపద్ముడు ప్రాణానికి తెగించి తానే అడవికి వెళ్ళి నవ సంజీవనీ మూలికలు తీసుకురావాలని సంక ల్పించాడు.

అయితే, ఆ విషయం బయటకు వెల్లడిస్తే మహారాణి, మంత్రులు, ప్రజలు తనను ఆటంక పరుస్తారని భావించిన శివపద్ముడు రహస్యంగా అడవికి వెళ్ళాలని నిర్ణయించు కున్నాడు.

ఆయన ఆస్థాన వైద్యులను పిలిపించి నవ సంజీవనీ మూలికలు ఎలా ఉంటాయో, నిశారణ్యంలో అవి ఎక్కడ దొరుకుతాయో వాకబు చేసి వివరాలు క్షుణ్ణంగా తెలుసు కున్నాడు.

ఒకనాటి రాత్రి శివపద్ముడు అంతఃపురం నుంచి రహస్యంగా అశ్వారూఢుడై బయలు దేరిపోయి నిశారణ్యం చేరాడు.

నిశారణ్యంలోకి ప్రవేశించిన మహారాజు వైద్యులు చెప్పిన సంజీవగిరి సమీపంలో ఒక ఊడల మర్రిచెట్టు కింద ప్రశాంతంగా తపస్సు చేసుకుంటున్న మూడుతలల రాక్ష సుణ్ణి చూసి విస్తుపోయాడు. తపోశాలి అయిన మూడుతలల రాక్షసుడి నుంచి తనకు ఎటువంటి ప్రమాదమూ జరగదని ఆశించాడు.

శివపద్ముడు గుర్రాన్ని దూరంగా ఒక చెట్టుకు కట్టేసి, మూడుతలల రాక్షసుడి తపస్సుకు భంగం కలగకుండా అతడు కళ్ళు తెరిచేవరకూ ఓపికగా అక్కడే కూర్చున్నాడు. కొంత సేపటికి కళ్ళు తెరిచిన రాక్షసుడు, శివపద్ముణ్ణి చూసి, ''చాలా కాలానికి కని పించిన నరుడివి. ఇంతకూ ఎవరు నువ్వు? ఎందుకు వచ్చావు?'' అని ప్రశ్నించాడు.

శివపద్ముడు వినయంగా రాక్షసుడికి నమ స్కరించి, ''రాక్షసోత్తమా! నా పేరు శివపద్ముడు. వింధ్యగిరిరాజ్య పాలకుడను. ప్రస్తుతం రాజ్యంలో ఒక వింత వ్యాధి ప్రబలి ప్రజలు మరణిస్తున్నారు. ఆ మరణాలు ఆపడానికి అవసరమైన నవసంజీవనీ మూలికలు ఇక్కడి సంజీవగిరిలో ఉన్నాయి. వాటి కోసమే వచ్చాను,'' అని చెప్పాడు.

''అందుకోసం రాజువైన నువ్వే స్వయంగా రావాలా? వైద్యులు, భటులు లేరా?'' అని ప్రశ్నించాడు రాక్షసుడు ఆశ్చర్యంతో.



వింధ్యగిరి, విక్రమపురి రాజ్యాల మధ్య మూడు తరాల శత్రుత్వం ఉన్నది. ధర్మనిరతుడైన శివపద్ముడు సింహాసనం అధిష్ఠించగానే సింహభూపతితో స్నేహానికి ప్రయత్నించాడు. అయితే, సింహభూపతి శివపద్ముణ్ణి ఆగర్భ శత్రువుగా పరిగణించి స్నేహాన్ని తిరస్కరించాడు. సమయం దొరికితే వింధ్యగిరిని కలుపుకుని, లేదా నాశపరచి పగ సాధించడానికి పథకాలు ఆలోచిస్తున్నాడు.

రాక్షసుడి దగ్గరున్న శివపద్ముణ్ణి సింహభూపతి గుర్తించి ఈసడింపుగా చూసి, రాక్షసుడివైపు తిరిగి, ''నీతో మాట్లాడాలని వచ్చాను,'' అని చెప్పాడు.

''వచ్చినపని చెప్పు,'' అన్నాడు రాక్షసుడు.

''నీతో ఏకాంతంగా మాట్లాడాలి,'' అన్నాడు సింహభూపతి.

ఆ మాట విన్న రాక్షసుడు, శివపద్ముడితో ''రాజా! నువ్వు వెళ్ళి మూలికలు సేకరించుకునిరా,'' అన్నాడు.

రాజు సంజీవగిరికేసి వెళ్ళాడు. అప్పుడు సింహభూపతి రాక్షసుడితో, ''మిత్రమా! శివపద్ముడు నాకు ఆగర్భశత్రువు. ఇప్పుడతని రాజ్యంలో ఒక వ్యాధి ప్రబలి ప్రజలు మరణిస్తున్నారు. ఆ మరణాలు ఆపడానికి అవసరమైన నవసంజీవనీ మూలికలు సంపాదించడానికి శివపద్ముడు అరణ్యానికి బయలుదేరిన సంగతి తెలిసి, నీ వద్దకు వచ్చాను. అవి అతడికి దక్కకుండా చూడు,'' అన్నాడు.

''అందువల్ల నీకు ఒరిగే ప్రయోజనం ఏమిటి?'' అని ప్రశ్నించాడు రాక్షసుడు.

''ఈ అడవిలో నువ్వు సంచరిస్తున్న విషయం తెలిసి ఇక్కడికి రావడానికి ఒక్కరూ సాహసించడంలేదు, అందుకని నేనే బయలుదేరి వచ్చాను,'' అన్నాడు శివపద్ముడు.

''నీకు ప్రాణభయం లేదా?'' అని అడిగాడు మూడుతలల రాక్షసుడు.

''ప్రజలక్షేమం, రాజుగా నా ప్రథమ కర్తవ్యం. అందుకు ప్రాణాలు ఇవ్వడానికైనా నేను సిద్ధం,'' అన్నాడు శివపద్ముడు.

రాక్షసుడు రాజువంక ప్రశంసగా చూశాడు.

అంతలో దూరంగా గుర్రపుడెక్కల చప్పుడు వినవచ్చింది. రాక్షసుడు, శివపద్ముడు వస్తున్నది ఎవరా? అని అటుకేసి చూశారు.

కొద్ది క్షణాల్లో అశ్వారూఢుడైన వ్యక్తి వారి వద్దకు వచ్చాడు. అతణ్ణి విక్రమపురి రాజు సింహభూపతిగా, శివపద్ముడు గుర్తించాడు.

''సంజీవనీ మూలికలు దొరకకపోతే వింధ్యగిరి రాజ్యం క్రమంగా శ్మశానంగా మారుతుంది. నా పగ చల్లారుతుంది,'' అని చెప్పాడు సింహభూపతి ఆవేశంతో.

''నీ కోరిక తీరిస్తే మరి నాకేమిస్తావు?'' అని అడిగాడు రాక్షసుడు.

''నువ్వు కోరిన కోరికను అది ఎటువంటి కోరికైనా తీరుస్తాను,'' అన్నాడు సింహభూపతి ఉత్సాహంతో.

''నా ఆకలి తీర్చడానికి ప్రతి రోజూ ఒక మనిషిని నీ రాజ్యం నుంచి నా దగ్గరకు పంప గలవా?'' అన్నాడు రాక్షసుడు.

''సంతోషంగా పంపగలను,'' అన్నాడు సింహభూపతి క్షణం కూడా ఆలోచించకుండా.

ఆలోగా శివపద్మడు నవసంజీవనీ మూలి కలతో అక్కడికి చేరాడు. మూడుతలల రాక్ష సుడు సింహభూపతివైపు ఆగ్రహంగా చూసి, ''నీవంటి మూర్ఖుణ్ణి నేనింతవరకూ చూడ లేదు. శివపద్మడి పాదాలకు నమస్కరించి తక్షణం ఇక్కడి నుంచి వెళ్ళిపో,'' అని హూంక రించాడు.

క్షణం ఆలోచించిన సింహభూపతి, శివ పద్మడితో, ''నన్ను క్షమించు,'' అని ఆయ నకు పాదాభివందనం చేసి మౌనంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

శివపద్మడు, మూడుతలల రాక్షసుడికి నమస్కరించి, ''రాక్షసోత్తమా! నేను ఒక సహాయం కోరి నీవద్దకు వస్తే, నువ్వు రెండు సహాయాలు చేశావు. నీకు నా జన్మాంతం కృతజ్ఞుణ్ణి!'' అన్నాడు.

''నీ ధర్మనిరతి శ్లాఘనీయం. ఇప్పుడే నేను నిశారణ్యం వదలి మరొక అరణ్యానికి వెళ



తాను,'' అంటూ పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ అక్కడి నుంచి బయలుదేరాడు.

శివపద్ముడు నవసంజీవనీ మూలికలతో రాజ్యం చేరాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా! రాక్షసుడు అడిగిన నరమాంసం పంపడానికి సైతం సమ్మతించిన సింహభూపతిని, మూడుతలల రాక్షసుడు మూర్ఖుడివి అని ఎందుకు నిందించాడు. అన్నాళ్ళు ఆగర్భశత్రువుగా భావించిన శివపద్ముడికి, సింహభూపతి ఎందుకు పాదాభివందనం చేశాడు? రాక్షసుడికి భయపడి అలా చేశాడా? నవ సంజీవనీ మూలికలు సంపాదించడానికి అనుమతించడం రాక్షసుడు చేసిన తొలి సహాయం. మరి అయితే, శివపద్ముడు ప్రస్తావించిన రెండో సహాయం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''శివపద్ముడు, ప్రజల ప్రాణాలు కాపాడ్డానికి తనప్రాణం పణంగా పెడితే, సింహభూపతి తన తాత తండ్రులనాటి పగ తీర్చుకోవడానికి తన రాజ్య ప్రజల ప్రాణాలను బలిచేయడానికి పూనుకున్నాడు. అందుకే రాక్షసుడు సింహభూపతిని మూర్ఖుడివని నిందించాడు. రాక్షసుడి మందలింపుతో ఆలోచనలో పడిన సింహభూపతి ఆ నిజం గ్రహించబట్టే, శివపద్ముడికి క్షమాపణ చెప్పి, పాదాభివందనం చేశాడు. రాక్షసుడికి భయపడి కాదు. పశ్చాత్తాప హృదయుడైన సింహభూపతి భవిష్యత్తులో శివపద్ముడితో వైరం మాని, స్నేహంగా మసులుకుంటాడు. అదే రాక్షసుడు చేసిన రెండో సహాయం. ఇకపోతే తపస్సు చేసుకునే మూడు తలల రాక్షసుడు నరమాంసం కోరడం, సింహభూపతిని పరీక్షించడానికేగాని, నిజంగా కాదు. వింధ్యగిరి ప్రజలు తన ఉనికిని తెలుసుకుని భయపడుతున్నారు గనక, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు,'' అని అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం: గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు రచన]*



# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

10

చిత్రాలు: గాంధి అయ్యా



అవరోధాలను అధిగమించుకుంటూ తూరుపు ప్రాంతంకేసి వెళుతూన్న ఆర్యకు హెచ్చరిస్తున్నట్టు కొన్ని పీడకలలు గోచరించాయి. హఠాత్తుగా ఒక పసివాడు ఎదురవడంతో వాణ్ణి కనిపించకుండా పోయిన పిల్లవాడా అని అడిగాడు ఆర్య.






రాజేమిటి? మా తల్లిదండ్రులు మాకోసం వెతుకుతూ ఉంటారు.... మమ్మల్ని వెళ్ళనివ్వు.
సమస్య తలెత్తినప్పుడు మాత్రమే చర్యలకు దిగాలన్నది రాజుల నియమం.
అయితే...
మేమెందుకు బాధ అనుభవించాలి?
మేము మా వాళ్ళను చూడగలమా?
మీరు బాధ అనుభవించరు. ఈ అగ్నిపరీక్ష ముగియగానే మీరు అనుభవించిన బాధలకు ప్రతిఫలంగా మీలో ప్రతి ఒక్కరూ అతీత శక్తులు కలవారుగా ఆశీర్వదించబడగలరు.
వాళ్ళను చూడ్డమే కాదు. వాళ్ళ ద్వారానూ చూడగలరు.
ఈ అగ్నిపరీక్ష ఎప్పుడు అంతమవుతుంది?


మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చి రాజు నన్ను కనుగొన్నప్పుడు!


ఎవరాయన? ఆయనకు నా వలన కావలసినదేమిటి?


ఆ సంగతి నీకు చెబితే, ఆయన ఆగ్రహానికి నేను గురికాగలను రాజా! బయలుదేరుదాం...


తూరుపు ప్రాంతానికి!


ఆర్య, ఆ పసివాడు, నిర్విరామంగా రెండు రోజులపాటు ప్రయాణం సాగించి, ఆఖరికి తూరుపు ప్రాంతం చేరుకున్నారు.


ధర్మపిత ఇక్కడికి కొద్ది దూరంలోనే ఉంటాడు. మనం కాలినడకనే వెళ్ళవలసి ఉంటుంది రాజా!
ఇంకా ఎంత దూరం?
కొంచెం దూరమే!
అక్కడే... అక్కడే ఆయన ఉంటున్నాడు.
ఆ ఎముకలు?
నువ్వు చాలా కల్పిత కథలు చదివినట్టుంది! ఆయన నరమాంసభక్షకుడైన రాక్షసుడు కాడు.
నువ్వు రాగలవని నేను ఊహించినట్టే వచ్చావు...
(ఇంకావుంది)



# రామాయణం

## యుద్ధ కాండ - 11

దుఃఖంతో బాధపడుతున్న రాముడితో విభీషణుడు మరొక విషయం కూడా బయట పెట్టాడు. ''నికుంభిలా హోమం చేస్తూండగా మధ్యలో ఎవడు నీతో యుద్ధం చేస్తాడో వాడి చేతిలో నీకు చావున్నది,'' అని బ్రహ్మ ఇంద్రజిత్తుకు చెప్పాడు. ఇప్పుడా హోమాన్ని భంగ పరచటానికి అవకాశం దొరికింది.

తరవాత రాముడి ఆజ్ఞ పొంది లక్ష్మణుడు సుగ్రీవ హనుమంత విభీషణులనూ, వానర సేననూ వెంటబెట్టుకుని, ఇంద్రజిత్తు హోమ కార్యం భంగం చేసి అతణ్ణి చంపటానికి బయలుదేరాడు. వారి దారికి అడ్డంగా రాక్షస సేన నిలబడి ఉన్నది. ఇంద్రజిత్తు హోమం పూర్తి చేసే లోపలనే ఆ రాక్షస సేనను నిర్మూలించవలసి ఉంటుందని లక్ష్మణుడితో విభీషణుడన్నాడు. ఆ సేన నిర్మూలమయితే హోమం ముగియకపోయినా ఇంద్రజిత్తు బయలుదేరి వస్తాడు, అప్పుడతణ్ణి తేలికగా కడతేర్చవచ్చు.

ఈ మాట విని వానరసేన రాక్షససేనపై విరుచుకుపడింది. ఉభయపక్షాలూ దారుణంగా పోరాడాయి. వానరులూ, రాక్షసులూ కూడా పెద్ద సంఖ్యలోనే చచ్చారుగాని, రాక్షసులు వానరుల ముందు నిలవలేకపోయారు.

ఆ వార్త విని ఇంద్రజిత్తు హోమకార్యం పూర్తికాకుండానే లేచి వచ్చి రథమెక్కాడు. రాక్షససేన అతని రథం చుట్టూ మూగింది. కాని హనుమంతుడు పర్వతాకారం ధరించి, పెద్దపెద్ద చెట్లతో రాక్షసులను చావమోదసాగాడు. రాక్షసులు వేల సంఖ్యలో హనుమంతుణ్ణి చుట్టుముట్టారు. తన మీద రకరకాల ఆయుధాలను ప్రయోగించే ఆ రాక్షసులం





భూతాలకు బలులిచ్చి, యుద్ధానికి బయలు దేరుతాడు.

''లక్ష్మణా, ఇంద్రజిత్తు జమ్మిచెట్టును ప్రవేశించక ముందే అతణ్ణి రథాశ్వసారథి సహితంగా నిర్మూలించు,'' అన్నాడు విభీషణుడు. లక్ష్మణుడు చప్పున జమ్మిచెట్టు వద్దకు వెళ్ళి, ఇంద్రజిత్తును తనతో యుద్ధానికి రావలసిందిగా పిలిచాడు.

ఇంద్రజిత్తు లక్ష్మణుడితో ఏమీ అనక, విభీషణుడి కేసి తిరిగి, ''విభీషణా, నీకు కులాభిమానం లేదు. ఈ గడ్డ మీద పుట్టి పెరిగిన వాడివి నాకెలా ద్రోహం తలపెట్టావు? నీకు బంధుత్వం గాని, మమకారం గాని, ధర్మం గాని లేదు. అయిన వారిని వదిలి శత్రువులకు భృత్యుడవయ్యావు! అయిన వారి మధ్య గౌరవంగా ఉండటం కన్న శత్రువుల వద్ద నీచుడుగా ఉండటం నీకు సమ్మతమయింది. నీ బుద్ధి నశించింది. అందుకే నా హోమానికి విఘ్నం కలిగించటానికి లక్ష్మణుణ్ణి ప్రోత్సహించి జమ్మిచెట్టు దగ్గరికి తీసుకువచ్చావు. ఇలాంటి పని ఇంకెవడూ చెయ్యడు,'' అన్నాడు.

ఆ మాటలకు విభీషణుడు, ''నా సంగతి తెలియనట్టుగా ఎందుకిలా మాట్లాడతావు? నేను రాక్షసుడనై పుట్టానే గాని, నాది రాక్షస స్వభావం కాదు. నేను అధర్మం సహించలేకనే నా సొంత అన్నను వదిలిపెట్టేశాను. మంచి వాడైనా పాపులను అంటిపెట్టుకుని పాపాత్ముడౌతాడు. దుష్టసర్పాలను దూరంగా ఉంచాలి. పర ధనాన్నీ, పర స్త్రీలను కోరటమూ, స్నేహి

దరితోనూ హనుమంతుడు ఒకేసారి భయంకరంగా యుద్ధం చేశాడు. రాక్షసులను అదేపనిగా హనుమంతుడు మట్టుపెట్టుతూ ఉండటం చూసి ఇంద్రజిత్తు తన రథాన్ని అతనికేసి నడిపించాడు. ఇంద్రజిత్తు వేసే బాణాలతో తీవ్రంగా గాయపడి హనుమంతుడు, ''దుర్మార్గుడా, నువ్వు నిజంగా వీరుడవైతే ఆయుధాలు లేకుండా వట్టి చేతులతో నాతో యుద్ధం చెయ్యి,'' అని అతడికేసి వెళ్ళాడు.

''ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి బాణాలతో చంపెయ్యగలడు. నువ్వు వెళ్ళి ఇంద్రజిత్తునెదుర్కొని యుద్ధం చేసి చంపెయ్యి,'' అని లక్ష్మణుడితో విభీషణుడన్నాడు.

వెంటనే ఇద్దరూ కలిసి నికుంభిలకేసి వెళ్ళారు. అది నల్లని రాక్షసిలాగా కనిపించే జమ్మిచెట్టు కింద ఉన్నది. ఇక్కడే ఇంద్రజిత్తు

తులను నమ్మకపోవటమూ నాశహేతువులు. వాటి మూలంగా నీ తండ్రీ, నువ్వూ కూడా చావనున్నారు. మాయా సీతను వధించి రామ లక్ష్మణులకు అవమానం కలిగించిన నువ్వూ బతికి ఉండటానికి తగవు. లక్ష్మణుడి చేతిలో చచ్చి నరకానికి వెళ్ళు,'' అన్నాడు.

ఇంద్రజిత్తు మహా కోపంతో అస్త్రాలు ధరించి రథమెక్కి, హనుమంతుడి వీపు మీద ఉన్న లక్ష్మణుడితో, ''రాత్రి యుద్ధంలో నిన్నూ, నీ అన్ననూ, నా బాణాలతో మూర్ఛ పోగొట్టాను. అది నువ్వు మరిచి అయినా ఉండాలి, లేక నీకు చావు దగ్గిర పడి అయినా ఉండాలి,'' అన్నాడు.

దానికి లక్ష్మణుడు, ''ఓరీ రాక్షసుడా? నువ్వు మమ్మల్ని మాటలతోనే చంపుతున్నావు గాని నిజంగా చంపటం నీ తరం కాదు. కార్య శూరుడు ప్రగల్భాలు పలకడు. నువ్వు దొంగ లాగా మాకు కనిపించకుండా యుద్ధం చేశావు. అది వీరుడు చేసే పనికాదు. ఇలా ఎదురుగా కనిపిస్తూ నీ ప్రతాపం ఏ పాటిదో చూపు,'' అన్నాడు.

మరుక్షణమే ఇంద్రజిత్తు వేగంగా లక్ష్మ ణుణ్ణి తన తీక్షణమైన బాణాల పరంపరతో కొట్టి సింహనాదం చేశాడు. లక్ష్మణుడు కూడా ఇంద్రజిత్తును క్రూరమైన బాణాలతో కొట్టాడు. ఇద్దరూ సమంగా యుద్ధం సాగించారు.

మధ్యలో విభీషణుడు లక్ష్మణుడితో, ''ఇంద్రజిత్తు ధైర్యం సన్నగిల్లుతున్నది. వాడి ముఖంలో వెలవెలపాటు కనిపిస్తున్నది. వీలయినంత త్వరలో వీణ్ణి చంపెయ్యి,'' అని



హెచ్చరించాడు. నిజంగానే లక్ష్మణుడి బాణా లకు ఇంద్రజిత్తు క్షణం పాటు స్పృహతప్పి, అంలోనే మళ్ళీ తెప్పిరిల్లాడు. ఇద్దరూ అమి తమైన పట్టుదలతో పోరాడుతూ ఒకరినొకరు బాగా గాయపరచుకున్నారు.

వారి యుద్ధం చూస్తూంటే విభీషణుడికి కూడా యుద్ధం చెయ్యాలనిపించింది. అతను తన నలుగురు మంత్రులతో సహా రాక్షసులను సంహరించుతూ, వానరులతో, ''వానర వీరు లారా, ఇక రావణుడికి మిగిలి ఉన్న వీరుడు ఈ ఇంద్రజిత్తు ఒక్కడే. మిగిలిన వాళ్ళ నందర్నీ మీరే చంపేశారు. వీడు నా అన్న కొడుకు. నేను వీణ్ణి చంపలేను. ఆ పని లక్ష్మణుడు చేస్తాడు. ఇంద్రజిత్తుకు అండగా ఉన్న రాక్షసులను మీరు చంపేసి, ఇంద్రజిత్తు చావుకు తోడ్పడండి,'' అన్నాడు.



వానరవీరులు ఎంతో ఉత్సాహంతో తోక లాడిస్తూ, సింహనాదాలు చేస్తూ రాక్షసుల పైన తలపడ్డారు. ఈ లోపల లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని చంపేశాడు. ఇంద్రజిత్తు తన రథాన్ని తానే నడుపుకుంటూ యుద్ధం సాగించాడు. ఆ సమయంలో నలుగురు వానరవీరులు ఇంద్రజిత్తుయొక్క రథాశ్వాల పైన పడి వాటిని చంపేశారు, అతని రథాన్ని విరిచి పారేశారు. ఇంద్రజిత్తు నేలపైకి దిగి లక్ష్మణుడితో యుద్ధం సాగించాడు.

అతను తన రాక్షసులతో, ''నేను రహస్యంగా నగరంలోకి పోయి ఇంకో రథంతో తిరిగి వస్తాను. నాకు అడ్డంగా నిలబడి మీరు వానరులతో యుద్ధం చేస్తూ ఉండండి. వానరులు నా దారికి అడ్డం రాకుండా చూడండి,'' అన్నాడు. అతను రాక్షసుల వెనకనుంచి, వానరుల కంట పడకుండా లంకా నగరంలోకి వెళ్ళిపోయాడు. అతను మరొక రథం పైన యుద్ధ భూమికి తిరిగి వచ్చి, లక్ష్మణ విభీషణుల నెదుర్కొన్నాడు. ఎప్పుడు వెళ్ళాడో తెలియకుండా మరొక రథంలో ప్రత్యక్షమైన ఇంద్రజిత్తు ఉపజ్ఞను వాళ్ళిద్దరూ మెచ్చుకున్నారు.

మళ్ళీ ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ యుద్ధం సాగించారు. మరొకసారి లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని చంపాడు. కాని రథాశ్వాలు సారథి అవసరం లేకుండానే రథాన్ని నడపవలసిన విధంగా నడిపాయి. ఇంద్రజిత్తు లక్ష్మణుడితో బాటు విభీషణుడి మీద కూడా బాణాలు వేశాడు. విభీషణుడు మండిపడి తన గదతో ఇంద్రజిత్తు రథాశ్వాలను చంపేశాడు.

ఇంద్రజిత్తు నేలపైకి దూకి, శక్తి తీసుకుని విభీషణుడి పైన విసిరాడు. లక్ష్మణుడు దాన్ని తన బాణాలతోనే పది ముక్కలుగా నరికేశాడు. తరవాత ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ ఒకరి పైన ఒకరు దివ్యాస్త్రాలను ప్రయోగించుకున్నారు. అవి ఒక దాన్నొకటి తాకేసరికి నిప్పు రవ్వలూ, మంటలూ, పొగా బయలుదేరాయి. ఇలా కొంతసేపు ఒకరి అస్త్రాలనొకరు ధ్వంసం చేసుకున్నాక లక్ష్మణుడు ఒక దివ్యబాణంతో ఇంద్రజిత్తు తల నరికేశాడు. విభీషణుడూ, వానరులూ సింహనాదాలు చేశారు. రాక్షసులు పారిపోయారు.

ఇంద్రజిత్తును చంపేసి వానరులకు మితిలేని ఆనందాన్ని కలిగించి, లక్ష్మణుడు హనుమంతుణ్ణీ, విభీషణుణ్ణీ వెంటబెట్టుకుని

సుగ్రీవుడూ, రాముడూ, ఉన్న చోటికి వెళ్ళాడు. ''ఇంద్రజిత్తు చచ్చాడు,'' అని లక్ష్మణుడు చెప్పగానే, రాముడు అతణ్ణి కౌగలించుకుని, ''ఇక రావణుడూ చచ్చిన వాడే. లక్ష్మణా, నువ్వు చేసినది చాలా గొప్ప పని!'' అన్నాడు.

వైద్యంలో నిపుణుడైన సుషేణుడు వచ్చి, లక్ష్మణ విభీషణులకు గుచ్చుకున్న బాణాలు తీసేసి, చికిత్స చేశాడు. వానరసైనికులు ఉత్సాహంతో గంతులు వేయసాగారు.

దేవేంద్రుణ్ణి సైతం జయించిన ఇంద్రజిత్తు లక్ష్మణుడి చేతిలో చచ్చిపోయాడని వినగానే రావణుడు మూర్ఛపోయాడు. అతను స్పృహ తెలిసి ఇంద్రజిత్తు కోసం చాలాసేపు దుఃఖించి, దుర్భరమైన రోషంతో, ''అస్తమానమూ రాముణ్ణే ధ్యానించే సీత బతికి ఉండటం దేనికి? ఇప్పుడే చంపేస్తాను!'' అంటూ కత్తిదూసి సీత ఉన్న చోటికి వేగంగా బయలుదేరాడు. అతణ్ణి మంత్రులూ, భార్యలూ వెంబడించి రాసాగారు. మంత్రులు వారించటానికి యత్నిస్తే రావణుడు వినిపించుకోలేదు.

సీత అతడి రౌద్రాకారాన్ని అంత దూరంలోనే చూసి తనకు చావు మూడిందని భయపడింది. ఆనాడే హనుమంతుడి వీపు మీద ఎక్కి రాముడి వద్దకు వెళ్ళిపోనందుకు పశ్చాతాపపడింది.

చిట్టచివరకు రావణుడికి సుపార్శ్వుడనే మంత్రి అడ్డంపడి, ''నీ వంటి బుద్ధిమంతుడు ఆడదాన్ని చంపటమేమిటి? చేతనయితే సీతను వశపరుచుకో. ఈ కోపమంతా రాముడిపైన చూపించు. ఇవాళ కృష్ణ చతర్దశి.





యుద్ధ పయత్నం ప్రారంభించి, రేపు అమావాశ్య నాడు రామలక్ష్మణులతో యుద్ధం చెయ్యి,'' అన్నాడు. సుపార్శ్వుడన్న మాటలు నచ్చి, రావణుడు మౌనంగా ఇంటికి తిరిగి వెళ్ళాడు.

అతను తన సేనాపతులతో, ''ఇవాళ మీరంతా వెళ్ళి రాముడితో యుద్ధం చెయ్యండి. అతణ్ణి మీరు చంపలేకపోయినా, మీతో పోరాడి నీరసించి ఉండేరాముణ్ణి నేను రేపు అవలీలగా చంపుతాను,'' అని చెప్పాడు.

రాక్షసులు యుద్ధానికి బయలుదేరి వెళ్ళి వానరులపై దారుణ యుద్ధకాండ సాగించేసరికి రాముడు పూనుకుని, వారిని తన బాణాలతో లక్షల సంఖ్యలో అంతమొందించాడు. లంకానగరంలో చచ్చిన రాక్షసుల భార్యల ఆర్తనాదాలు మిన్నుముట్టాయి.

ఇంక రావణుడు తానే స్వయంగా రామలక్ష్మణులను చంపటానికి బయలుదేరాడు. అతని వెంట రథాలపై మహాపార్శ్వుడూ, మహోదరుడూ, విరూపాక్షుడూ మొదలైన వారు బయలుదేరారు. అందరూ కలిసి, రామలక్ష్మణులుండే ఉత్తర ద్వారం కేసి వెళ్ళారు.

రాక్షస సేన యుద్ధసన్నద్ధమై వస్తూండటం తెలిసి వానరులు కూడా యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. రావణుడు తన బాణాలతో వానరులను అపారమైన సంఖ్యలో చంపేస్తూ రాముడున్న చోటికి పోసాగాడు. అది చూసి సుగ్రీవుడు రాక్షస సేనలపైన కొండ రాళ్ళ వర్షం కురిపించి, రాక్షసులను కూడా అపారమైన సంఖ్యలో చంపసాగాడు. అప్పుడు విరూపాక్షుడు రథం మీది నుంచి ఒక ఏనుగు మీదికి మారి సుగ్రీవుడితో పోరాడవచ్చాడు. సుగ్రీవుడతనితో భయంకరంగా యుద్ధం చేసి మొదట ఏనుగునూ తరవాత విరూపాక్షుణ్ణీ కూడా చంపేశాడు.

తన సైన్యాలు క్షీణించిపోతూ ఉండటం చూసి రావణుడు వానరసేనను నిర్మూలించమని మహోదరుణ్ణి ఆజ్ఞాపించాడు. సుగ్రీవుడు మహోదరుడితో కూడా చాలా సేపు యుద్ధం చేసి చివరకతణ్ణి చంపాడు. వానరులు సింహనాదాలు చేశారు.

ఈ లోపల మహాపార్శ్వుడు అంగదుడి సేన పైకివెళ్ళి, అంగదుడితో ద్వంద్వయుద్ధం చేసి, కొంత సేపటికి అతని చేతిలో ప్రాణాలు విడిచాడు.

రామాయణం క్విజ్ సెప్టెంబర్ 2009
సరైన సమాధానం: C
విజేతకు అభినందనలు: ఆకుల ఆంజనేయులు, వరంగల్-506 221

తన వెంట వచ్చిన ముగ్గురు మంత్రులూ చావటం చూసి రావణుడు మహాకోపంతో రాముడి పైకివెళ్ళి, యుద్ధం ప్రారంభించాడు. ఇద్దరూ ఒకరిపైన ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకున్నారు; ఒకరి అస్త్రాలను ఒకరు నిర్మూలించారు. చివరకు ఒకరినొకరు బాణాలతో మర్మస్థానాలలో కొట్టారు.

రాముడు రావణుణ్ణి తీవ్రంగా గాయపరిచి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో లక్ష్మణుడు విల్లు ఎక్కుపెట్టి రావణుడి ధ్వజాన్నీ, వింటినీ విరగగొట్టాడు. విభీషణుడు గద తీసుకుని రావణుడి రథాశ్వాలను చంపాడు. రావణుడు రథం నుంచి కిందికి దిగి, తన తమ్ముడైన విభీషణుడి పైన ఒక శక్తిని ప్రయోగించాడు. లక్ష్మణుడాశక్తిని దారిలోనే తన బాణాలతో ఖండించాడు.

అది చూసి రావణుడు మరింత పెద్ద శక్తిని తీసి గిరగిరా తిప్పి, విభీషణుడిపై విసరబో

చంద్రమామ రామాయణం క్విజ్

ఇంద్రజిత్తును హతమార్చింది ఎవరు?
a.లక్ష్మణుడు b.హనుమంతుడు c.విభీషణుడు

మీ సమాధానాన్ని CRQ <a/b/c> <space> <Name, Lang, Place> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఒక అదృష్ట విజేతకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.



యాడు. లక్ష్మణుడు దానికి అంతరాయం కలిగించాడు. రావణుడు మహాకోపంతో ఆ శక్తిని లక్ష్మణుడి పైకే విసిరాడు. అది లక్ష్మణుడి రొమ్ములో లోతుగా దిగబడింది. లక్ష్మణుడు పడిపోయాడు.

రాముడది చూసి భరించరాని ఆగ్రహంతో రావణుడి పైన అతి దారుణమైన బాణాలు వేసి తీవ్రంగా బాధించాడు. రావణుడు రాముడి ధాటికి తట్టుకోలేక పారిపోయాడు.



## జాతక కథలు

పునఃకథనం: చందమామ

### గజరాజు – 2
































అంతవరకు కొడుకును తలుచుకుంటూ విలపిస్తున్న గజరాజుతల్లి ఊరడిల్లింది.




గజరాజు గౌరవార్థం, రాజు ఒక ఏనుగు విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు అత్యాశ హానికరమని ఆ విగ్రహం తనను హెచ్చరిస్తున్నట్టు భావించాడు.



(అయిపోయింది)

# వేగ సూత్రం

## ఈ నెల సమస్య:



ఒక దొంగల ముఠా పోలీసుల కళ్ళుకప్పి రెండు కార్లలో తప్పించుకుని పారిపోతున్నారు. వాటిలో ఒక కారు నీలంరంగు, రెండవది బూడిదరంగు కారు. దొంగలను పట్టుకోవాలంటే పోలీసులు ఆ ప్రాంతంలోని నీలం, బూడిదరంగు కార్లన్నిటినీ సోదా చెయ్యాలి. ఆ ప్రాంతం ఉత్తర భాగంలోని నీలంరంగు కార్లను 1955తో గుణించి ఆ మొత్తాన్ని 2482తో కలుపగా వచ్చే మొత్తం, బూడిదరంగు కార్లను 476తో గుణించగా వచ్చే మొత్తానికి సమానం. దక్షిణ ప్రాంతంలోని నీలం కార్లను 476తో గుణించి ఆ మొత్తాన్ని 4913తో తీసివేయగా వచ్చే మొత్తం, బూడిద రంగు కార్లను 1955తో గుణించగా వచ్చే మొత్తానికి సమానం. అలా అయినట్టయితే పోలీసులు సోదా చేసిన నీలంరంగు కార్లు, బూడిదరంగు కార్లు ఎన్ని? ఈ సమస్య పరిష్కారానికి దగ్గరి వేగ సూత్రం ఏది?

మీ వేగసూత్రాన్ని నవంబర్ 30వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ. 500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:
ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్-600041.
లేదా contests@chandamama.com కు ఇ-మెయిల్ చేయండి.

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం జనవరి '10 సంచికలో ప్రచురించబడుతుంది.*

---

సెప్టెంబర్ నెల సమస్యకు సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు. ఇదీ సరైన సమాధానం:

మొత్తం గులాబీల ధర : 2X17=34
మొత్తం సూర్యకాంతి పువ్వుల ధర: 3X13=39
మొత్తం కలువ పువ్వుల ధర : 4X9=36
∴ ఒక పూలగుచ్ఛం ధర: 34+39+36=109
మొత్తం అతిథుల సంఖ్య:
1+2+1+1+62+40=107
∴ 107 అతిథుల పూలగుచ్ఛాలకు అయ్యే మొత్తం ఖర్చు=109X107

101 నుంచి 109 మధ్యగల రెండు సంఖ్యలను గుణించవలసివచ్చినప్పుడు ఈ పద్ధతిని అనుసరిస్తే సమాధానాన్ని వేగంగా కనుగొనవచ్చు.

*స్టెప్ 1:* రెండు సంఖ్యలలో ఒకటవ స్థానంలో ఉన్న అంకెలను గుణించుకోవాలి. అంటే ఇక్కడ 9X7(109నుంచి9,107 నుంచి 7 అన్నమాట) =63. దీనిని మీ సమాధానం కుడివైపు రాసుకోండి.

*స్టెప్ 2:* రెండవ సంఖ్య ఒకటవ స్థానం అంకెకు ఒక సంఖ్య కలుపుకోవాలి అంటే 109+7 లేదా 107+9 రెండింటికీ సమాధానం 116 వస్తుంది. దీన్ని సమాధానంలో ఎడమవైపున రాసుకోండి. ఇప్పుడు మీ సమాధానం 11663 వస్తుంది. 109X107 గుణకార మొత్తం కూడా ఇదే. మొత్తం ధర మీద ఇచ్చిన తగ్గింపు 10%. 11663 నుంచి 1166.3 తీసేయండి.(11663లో పదో వంతు 1166.3) చివరి సమాధానం: 10496.70

# యురేకా

## కనిపించని సిరా

ఏమేం కావాలి?




- తెల్ల కాగితం
- నీరు
- వంటసోడా
- పెయింట్ బ్రష్ లేదా పన్నుపుల్ల
- ఉష్ణ వనరు(100 వాట్ల విద్యుత్ దీపం)
- ద్రాక్షరసం

తయారు చేయడం ఎలా?



- ఒక స్పూన్ వంటసోడాను నీటిలో బాగా కలపండి. ఇదే మీ కనిపించని సిరా అవుతుంది.
- ఈ మిశ్రమాన్ని పెయింట్ బ్రష్ లేదా పన్నుపుల్లతో అద్దుకుని మీరు రాయాలనుకున్నదానిని కాగితం మీద రాయండి. కాస్సేపు ఆరనివ్వండి. మీరు రాసిన దానిని స్పష్టంగా చూడడానికి ఇప్పుడు రెండు విధానాలు ఉన్నాయి:
- కాగితాన్ని వెలుగుతున్న విద్యుత్ దీపం సమీపంలో ఉంచండి. కొద్ది నిమిషాల్లో మీరు రాసిన విషయం స్పష్టంగా కనిపిస్తుంది.
- కాగితానికి ద్రాక్షరసం పూసి కూడా మీరు రాసిన విషయాన్ని చక్కగా చదవవచ్చు.
- నిమ్మరసం, పాలు, వెనిగర్ మొదలైన ఇతర ద్రవాలతో ఈ ప్రయోగం చేసి మీ సొంత కనిపించని సిరాలు తయారుచేసుకోండి.

కాన్సెప్ట్:

చాలా సరళమైన ఈ కనిపించని సిరా ప్రయోగం ప్రధానంగా రెండు సూత్రాల మీద ఆధారపడి పనిచేస్తుంది: ఒకటి 'వేడి చర్య' రెండవది 'ఆసిడ్–బేస్ చర్య.' కాగితాన్ని విద్యుత్ దీపం సమీపంలో ఉంచినప్పుడు, వంటసోడా మీద వేడి ప్రభావం కారణంగా అక్షరాలు కనిపిస్తాయి.

కాగితం మీద ద్రాక్షరసం పూసినప్పుడు వంటసోడా(బేస్), ద్రాక్షరసం(తేలిక ఆమ్లం) మధ్య జరిగే చర్య ప్రతిస్పందన కారణంగా అక్షరాలు భిన్నమైన రంగులో చాలా స్పష్టంగా కనిపిస్తాయి.

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 10

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

*Co-sponsored by* Infosys *FOUNDATION, Bangalore*

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి

**రూ. 250లు.***

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - **10** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. నవంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. జనవరి 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## చాచా నెహ్రూలా




1. జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినాన్ని బాలల దినోత్సవంగా ఏ సంవత్సరం ప్రకటించారు?
2. నెహ్రూ కుటుంబాన్ని మొదట 'కౌల్స్' అనేవారు. వాళ్ళు తమ కుటుంబ నామాన్ని 'నేహ్రూ'గా ఎందుకు మార్చుకున్నారు?
3. నెహ్రూ భారత జాతీయ కాంగ్రెస్‌లో ఎప్పుడు చేరారు?
4. మనదేశ ప్రధానమంత్రిగా నెహ్రూ ఎంతకాలం పదవీ బాధ్యతలు నిర్వహించారు?
5. జవహర్‌లాల్ నెహ్రూ రచించిన మూడు ప్రధాన గ్రంథాలు ఏవి?
6. చాచా నెహ్రూకు అభిమాన పాత్రమైన పువ్వు ఏది?



తన చుట్టూ తాను తిరగని గ్రహం.. వివరాలకు telugu.chandamama.com చూడండి

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



KALANIKETAN BALU

NARAYANAMURTHY TATA





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు జనవరి 2010 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.


ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
**2/513,** సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ **- 600 041**


## అభినందనలు

కె.బుల్లెమ్మాయి,
భ.పే. సూర్యనారాయణ,
ఉండూరు, సామల్‌కోట్(మండల్),
తూర్పు గోదావరి జిల్లా,
ఆంధ్రప్రదేశ్-533 440.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





''ముగ్గురం ఒక్కటిగా''
''ఆ ముగ్గురికి తోడుగా''

## చందమామ లోకజ్ఞానం క్విజ్-8 సెప్టెంబర్ 2009 సమాధానాలు

1. సంస్కృతం, తమిళం, తెలుగు, కన్నడం 2. పాళీ, ప్రాకృతం 3. ఉర్దూ 4. బెంగాలీ
5. భాషోత్పత్తి శాస్త్రం 6. మాండారిన్ 7. 22 8. భారత్, బంగ్లాదేశ్.

*గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.*



# పశువు



ముత్యాలు వ్యవసాయం చేస్తూ తండ్రి నుంచి సంక్రమించిన ఐదెకరాల పొలాన్ని పదెకరాలు చేశాడు. వడ్డీ వ్యాపారం చేసి వేల రూపాయల నగదును లక్షలకు పెంచాడు. ఒకప్పుడు ఇంటి పెరట్లోనే కోళ్ళు, పశువులు ఉండేవి. ఇప్పుడు కోళ్ళకు, పశువులకు విడివిడిగా కొట్టాలున్నాయి.

జీవితంలో అపజయమంటే తెలియని ముత్యాలుకు సంతకం పెట్టడం కూడా రాదు. నోటి రుచికి తగ్గట్టు సుష్టుగా తినే ఆయన ఎన్నడూ సుస్తీ అన్నది ఎరుగడు.

''మనిషి ఆధీనంలో ఉండే పశువుకు స్వేచ్ఛ లేక మనిషికున్నన్ని బాధలూ ఉంటాయి. కానీ స్వేచ్ఛగా ఉండే పశువుకు అకాల మృత్యువే తప్ప అనారోగ్యం అంటూ ఏదీ ఉండదు. మన కర్తవ్యం నిర్వహిస్తూ ఫలితాన్ని దేవుడికి వదిలి ఎల్లవేళలా మనసును సంతోషంగా ఉంచుకోవడం మనం పశువుల నుంచే నేర్చుకోవాలి,'' అంటాడాయన.

ఆయన్ను ఎరిగున్నవారీ మాటలకు ఆశ్చర్యపడతారు. ఎందుకంటే ముత్యాలు పాలేళ్ళ చేత వెట్టిచాకిరీ చేయిస్తాడు. దాక్షిణ్యం అన్నది ఎరుగడు. వడ్డీవ్యాపారంలో మానవత్వం పాటించడు. కట్టుకున్న భార్యనూ, కన్నబిడ్డలనూ కూడా మాటలతోనో, చేతలతోనో పొద్దస్తమానం హింసిస్తూనే ఉంటాడు.

ముత్యాలు కాఠిన్యం కారణంగా ఎన్నో కొంపలు కూలిపోయాయి. అంతమందిని బాధపెడుతూ సంతోషంగా ఎలా ఉంటున్నాడూ అని కొందరూ, ఎంతమంది శాపనార్థాలు పెట్టినా ఏమీ కాదేమని మరికొందరూ ఆశ్చర్యపడుతూంటారు.

అలాంటప్పుడు ఆయనకు పీరయ్య ఉసురు తగిలింది.

పీరయ్య బక్కగా ఉంటాడు. భార్యనూ, పదేళ్ళ కొడుకునూ పోషించుకునేటందుకు అతడికన్న ముఖ్యమైన జీవనాధారం ఒక పాడి ఆవు మాత్రమే. అది ఒక్కటే ఐనా ఐదు ఆవుల

పెట్టు. అది పూటకు ఐదుశేర్ల పాలిస్తుంది. దానిపాలు శ్రేష్ఠమైనవనీ, శుభప్రదమనీ నమ్మి ఊరివారు ఎగబడి మరీ కొంటారు. పీరయ్య దాన్ని ఇంట్లో మనిషిలా ఆదరిస్తాడు; పర్వది నాల్లో దేవతగా పూజిస్తాడు.

దురదృష్టంకొద్దీ పీరయ్య భార్యకు పెద్ద జబ్బు చేసింది. వైద్యానికి డబ్బు అవసరమై అతడు ముత్యాలు వద్ద అప్పుచేసి అనుకున్న సమయానికి బాకీ తీర్చలేకపోయాడు. అతడి ఆవుమీద కన్ను వేసిన ముత్యాలు సమయం చూసి నిర్దాక్షిణ్యంగా బాకీ కింద ఆ ఆవును జమ కట్టుకున్నాడు. పీరయ్య కాళ్ళావేళ్ళా పడినా ఆయన రాతిగుండె కరగలేదు. ఏమీ చేయలేక, ''నీకు నా ఉసురు తగలకపోదు,'' అన్నాడు పీరయ్య.

ఆ తర్వాత.. శుభప్రదమైన పీరయ్య ఆవు పాలు ఒక్కరోజైనా తాగాడో లేదో జీవితంలో మొదటిసారిగా ముత్యాలుకు జబ్బు చేసింది. అది పీరయ్య ఉసురేనని ఊళ్ళో వాళ్ళతో పాటు ఆయన భార్య సత్తెమ్మ కూడా అంటే, ''ఇదే పాపమైతే ఇంతకంటే పెద్ద పాపాలు చాలా చేశాను. అప్పుడు తగలని ఉసురు ఇప్పుడెందుకు తగుల్తుందీ? అతి తెలివికి పోక ముందు వైద్యుణ్ణిపిలిపించు,'' అని మందలించాడాయన కోపంగా.

వైద్యుడు వచ్చి ముత్యాలు మీద కొన్ని పరీక్షలు చేసి పీరయ్య ఆవుపాలు ఆయనకు పడలేదని తేల్చాడు. ఆ ఆవును పశువైద్యుడికి చూపిస్తే దానికీ జబ్బుందని తేలింది. అటు ఆవుకూ ఇటు ముత్యాలుకూ వైద్యం ప్రారంభ



మైంది కానీ, ఇద్దరి పరిస్థితీ నానాటికీ తీసికట్టు గానే కనిపించింది. చివరికి ఒకరోజున, ''మీ జబ్బులు మందులకు నయమయ్యేవి కావు. ఆవు పీరయ్యకోసం బెంగెట్టుకుంది. ఆ ఇంటికి తిరిగి వెడితే దాని జబ్బు తగ్గుతుంది. అప్పుడు పీరయ్య సంతోషిస్తే మీ జబ్బూ నయమౌతుంది. నా మాట విని ఆవును పీరయ్య ఇంటికి తోలేయండి,'' అని భర్తను బతిమాలింది సత్తెమ్మ.

ముత్యాలు చిరాకుపడి ''నా ప్రాణంపోయినా ఆవును పీరయ్యకు వెనక్కిచ్చేది లేదు. అసలు తప్పంతా నీలో ఉంది. నువ్వు ఆవుకివ్వాల్సిన మందులు నాకూ, నాకివ్వాల్సినవి ఆవుకూ ఇస్తున్నావేమోనని నాకు అనుమానంగా ఉంది,'' అన్నాడు.

భర్త మొండితనానికీ, ఈసడింపుకూ సత్తెమ్మకూ చిరాకు వచ్చింది. ఆ రోజు ఆమె ఏమైతే అయిందని ఒక నిర్ణయంతో ఇద్దరి మందులూ మార్చింది. విచిత్రంగా ఆ రోజునుంచీ ముత్యాలుకూ ఆవుకూ జబ్బు తగ్గుముఖం పట్టడం మొదలై నాలుగు రోజుల్లో పూర్తిగా నయమైపోయింది.

''చూశావా–నాకు పీరయ్య ఉసురేం తగల్లేదు, ఒప్పుకుంటావా?'' అన్నాడు ముత్యాలు భార్యతో గర్వంగా.

''ఇందులో మీరు గర్వపడాల్సిందేమీ లేదు. మనుషుల్ని పశువుల్లా చూసే మీలో క్రమంగా పశుత్వం ప్రవేశించింది. పశువుల్ని మనుషుల్లా చూసే పీరయ్య ఇంట్లో ఈ పశువుక్కూడా మానవత్వం అబ్బింది. అందుకే మీకు పశువుల మందూ, ఆవుకు మనుషుల మందూ పనిచేశాయి అది తెలుసుకోండి,'' అంది సత్తెమ్మ నిరసనగా.

మందుల విషయంలో ఆమె చెప్పింది నిజమేనని గ్రహించిన ముత్యాలు సిగ్గుపడ్డాడు. ఆ రోజునుంచీ ఆయనలో మంచి మార్పు వచ్చింది. ఆయన ప్రవర్తనలో వచ్చిన మార్పును చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

ఎంత రహస్యంగా ఉంచినా ఈ మందుల మార్పిడి విషయం దాగలేదు. అప్పటి నుంచి నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే వాళ్ళను, ''జబ్బు చేస్తే పశువుల వైద్యుడి దగ్గరికి వెళ్ళాలి, గుర్తుంచుకో,'' అని ఎద్దేవా చేయడం ఆ ఊళ్ళో వాడుకగా మారింది. – ''వసుంధర''





# తొందరపాటు

రత్నగిరి సంస్థానాధీశుడు రత్నభూపతి వేటకు వెళ్ళి, ఒక పులి వెంటబడి, పరివారానికి దూరమై దారి తప్పాడు. దారి తెలుసుకుని తిరిగి రాజభవనానికి చేరేసరికి బాగా పొద్దుపోయింది. అర్ధరాత్రి సమయంలో ఆయన శయనగృహంకేసి వెళుతూండగా గవాక్షం గుండా శయనమందిరంలో కనిపించిన దృశ్యం చూసి దిగ్భ్రాంతి చెందాడు. తన తల్పంపై పరాయి పురుషుడొకడు పడుకుని ఉన్నాడు! తలపై పిడుగుపడ్డట్టు హతాశుడయ్యాడు రాజు. పట్టరాని ఆవేశంతో ఒరలోని ఖడ్గాన్ని తీసి పడకమీది వ్యక్తి తల తెగటార్చడానికి ముందుకు అడుగువేయబోయాడు.

అంతలో, ''ఆగండి, ప్రభూ!'' అంటూ అటుగా వచ్చిన రాణిగారి ప్రధాన పరిచారిక రాజును అడ్డుకున్నది. రాజు మానసిక స్థితిని గ్రహించిన పరిచారిక, ''ఆవేశపడకండి, ప్రభూ! తమ తల్పంపై ఉన్నది మహారాణిగారే. విచిత్ర వేషధారణ అంటే రాణిగారికి మహా సరదా అని మీకు తెలుసుకదా. సాయంకాలం ఆమె రాజ్యాధికారి వేషం వేశారు. వేషం చక్కగా ఉందని అందరూ ప్రశంసించడంతో దాన్ని మీకు చూపాలన్న ఉత్సాహంతో మీ రాక కోసం ఎదురుచూస్తూ చూస్తూ అలాగే మీ పడకపై పడుకుని నిద్రపోయారు,'' అన్నది.

''ఎంత ఘోరం జరిగిపోయేది! సమయానికి వచ్చి నా ప్రాణ సమానమైన మహారాణి ప్రాణాలు కాపాడావు!'' అంటూ రాజు ఖడ్గాన్ని ఒరలో ఉంచాడు.

అప్పటికి నిద్రలేచిన మహారాణిని మందహాసంతో సమీపించాడు. రాజు తొందరపాటుతో అపార్థం చేసుకుని ఆవేశానికి లోనైనందుకు లోలోపల సిగ్గుపడుతూ, అమాయకంగా నవ్వుతూన్న మహారాణి తలను ఆప్యాయంగా నిమురుతూ పక్కన కూర్చున్నాడు.

–రత్నకుమార్



# నేలబొగ్గు కథ

భారత దేశంలో ప్రధాన ఇంధనవనరు శిలాంగారమైన నేలబొగ్గు. దీనిని రెండు విధాలుగా తవ్వి వెలుపలికి తీస్తారు. భూమి ఉపరితలంలో అంటే 200 అడుగుల లోపల లభించే నేలబొగ్గును వెలుపలి నుంచే గనులను తవ్వి తీస్తారు. భూమికి మరీ అడుగున అంటే వందలాది అడుగుల లోతున ఉన్న వాటిని భూగర్భగనుల తవ్వకం ద్వారా వెలికి తీస్తారు. మనదేశంలో 1774లో ప్రప్రథమంగా ఈస్ట్ ఇండియా కంపెనీ బొగ్గు తవ్వకాలను రాణిగంజ్ కోల్ ఫీల్డ్‌లో ప్రారంభించింది.

పందొమ్మిదివందలా డెబ్భైలలో బొగ్గు పరిశ్రమ జాతీయీకరణ చేయబడి ఐదు సబ్సిడియరీస్‌తో కోల్ ఇండియా కంపెనీ స్థాపించబడింది. మరో మూడు సబ్సిడియరీలు రూపొందించబడ్డాయి. ఉత్పత్తిలోనూ, ఆర్థిక పరంగానూ నైపుణ్యంతో ముందుండడం వల్ల కోల్ ఇండియా లిమిటెడ్‌కు భారత ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకమైన



'నవరత్న' అంతస్తును కల్పించింది!

ఈనాడు కోల్ ఇండియా లిమిటెడ్ ప్రపంచంలోకెల్లా అత్యధికంగా నేలబొగ్గును ఉత్పత్తి చేసే అతిపెద్ద కంపెనీ. 473 భూగర్భ, బహిరంగ గనులలో దాదాపు 4,12,000 మంది కార్మికులు పనిచేస్తున్నారు! యేటా దాదాపు 400 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి అవుతోంది. ఇది భారతదేశం మొత్తం మీది ఉత్పత్తిలో 82 శాతం. ప్రాథమిక వాణిజ్య ఇంధన అవసరంలో 45 శాతాన్ని ఇది సరఫరా చేస్తోంది. ఆయిల్, గ్యాస్ సెక్టార్లు రెండూ కలుపుకుంటే 39శాతం సమకూరుస్తున్నాయి. మనదేశంలోని 77 థర్మల్ విద్యుత్ ప్లాంట్లలో 75 ప్లాంట్లకు కోల్ ఇండియా నేలబొగ్గును సరఫరా చేస్తోంది.

**ప్రశ్నలు:**

1. భారతదేశంలో ప్రధాన ఇంధన వనరు ఏది?
2. రెండు రకాల గనుల తవ్వకాలు ఏవి?
3. మనదేశంలో నేలబొగ్గు పరిశ్రమ ఎప్పుడు జాతీయీకరణ చేయబడింది?
4. ప్రపంచంలో కెల్లా అతిపెద్ద నేలబొగ్గు ఉత్పత్తి కంపెనీ ఏది?
5. మనదేశంలోని ఎన్ని థర్మల్ పవర్ ప్లాంట్లు కోల్ ఇండియా నేలబొగ్గును ఉపయోగిస్తున్నాయి?
6. కోల్ ఇండియా ఇప్పటి నేలబొగ్గు ఉత్పత్తి ఎంత?

ITC Limited

# Kuch bhi karega for CANDYMAN

## Colour this Candyman picture and win exciting prizes!!










REGISTER, EARN POINTS & WIN EXCITING GIFTS!

**Just three steps for winning many exciting Candyman Prizes:**

- Fill some colours in your Candyman friend's life.
- Complete the slogan 'I like Candyman because...' in not more than 10 words.
- Complete all the details about yourself and send it by December 15, 2009 to:
  **Chandamama India Ltd, New no. 2/513 (Old no. 3/396)**
  **Sandeep Avenue East, 2nd Main road Chinna Neelankarai, Chennai-41.**

I like Candyman because ..........................................

Name: .......................... ☐Boy ☐Girl Age: ........ Address: ..........................

.......................................... Ph.No.: ..........................

School: .......................... Class: .......... E-mail ID: ..........................

**TERMS AND CONDITIONS**

1. This contest is open to all residents of India.
2. The participants understand that sending entries implies acceptance to the terms and conditions of this contest.
3. The entries for this contest shall be sent by ordinary post to Chandamama India Ltd, New no. 2/513 (Old no. 3/396) Sandeep Avenue East, 2nd Main road Chinna Neelankarai, Chennai-41 on or before December 15, 2009
4. Incomplete and/ or illegible entries shall be disqualified.
5. This contest is not open to employees of ITC Limited and Chandamama India Ltd and their family members.
6. ITC Limited reserves the right to extend, cancel, discontinue, withdraw, change, alter or modify this contest or any of the terms thereof with or without notification and without assigning any reason.
7. The winners of this contest shall be selected by a panel of judges appointed by ITC Limited.
8. The decision of ITC Limited will be final and binding with regard to any dispute arising out of this contest and is non-contestable. No correspondence shall be entertained in this regard.
9. The prizes shall be sent to the winners at the addresses specified in the entries sent by them and ITC Limited shall not be responsible if the winners are unavailable at such addresses.
10. ITC Limited and Chandamama India Ltd shall not be liable for incorrectly addressed or undelivered entries or for disruption, delay or non-receipt of entries due to postal delays or any other reason.
11. Prizes are non-transferable, non-negotiable, subject to availability and cannot be exchanged for cash.
12. ITC Limited shall not be liable for any loss expense or damage which may be suffered in connection with this contest or accepting or using any prize given under this contest.
13. All disputes in connection with or arising out of this contest are subject to the jurisdiction of courts located at Bangalore.



# వారంలో వివాహం




సువర్ణరాజ్యం రాజు సురేంద్రుడు ప్రతి విషయాన్నీ హేతుబద్ధంగా ఆలోచించేవాడు. తన రాజ్యప్రజలను మూఢవిశ్వాసాల బారిన పడకుండా కాపాడాలని కాంక్షించేవాడు. మహత్తులు ప్రదర్శించేవారన్నా, భవిష్యత్తును తెలిపేవారన్నా, ఆయనకు పరమచిరాకు. మాటకారితనంతో అమాయకులను మభ్య పెట్టి పబ్బం గడుపుకోవడం తప్ప వారిలో ఎలాంటి గొప్పదనమూ లేదని భావించే వాడాయన. అలాంటి వారి కుయుక్తులనూ, కుతంత్రాలనూ బయటపెట్టి ప్రజలకు వారిపట్ల ఉన్న భయభక్తులను పోగొట్టాలని ఉబలాటపడేవాడు.

ఇలా ఉండగా రాచనగరు బయట ఏటి ఒడ్డున మర్రిచెట్టు కింద ఒకసన్యాసి చేరాడనీ, ఆయనకు అనేక మహిమలూ, శక్తులూ ఉన్నాయని ప్రజలు భావిస్తున్నారనీ రాజుకు చారుల ద్వారా తెలియవచ్చింది. ఆ సంగతేదో చూడాలని రాజు ఎవరికీ చెప్పకుండా వ్యాపారి వేషంలో ఆ రోజు సాయంకాలమే సన్యాసి వద్దకు బయలుదేరాడు.

రాజు అక్కడికి వెళ్ళినప్పుడు సన్యాసి అక్కడ చేరిన భక్తులకు, ''పుట్టిన ప్రతి ఒక్కరూ మరణించక తప్పదు. మరణం ఏ క్షణంలో, ఏ రూపంలో వస్తుందో చెప్పలేము. అందువల్ల ప్రాణాలతో ఉన్న ప్రతి క్షణమూ పరులకు మేలు కలిగించే పనులను మన అవకాశాలను బట్టి చేస్తూ ఉండాలి!'' అని వేదాంతబోధ చేస్తున్నాడు.

ఉపన్యాసం ముగిశాకపలువురు భక్తులు వెళ్ళిపోయారు. ఐదారుగురు మాత్రం మిగి లారు. వారిలో ఒక్కొక్కరు తమ బాధలను సన్యాసితో చెప్పుకున్నారు. సన్యాసి తల పంకిస్తూ నోరు విప్పకుండా విబూది ఇచ్చి పంపాడు. చివరగా వచ్చిన రామయ్య అనే రైతు, సన్యాసికి నమస్కరించి, ''స్వామీ, నా ఒక్కగానొక్క బిడ్డ దేవిక. ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆమె పెళ్ళి జరిగేలా లేదు. తల్లిలేని

బిడ్డ. సకాలంలో ఒక అయ్య చేతిలో పెట్టాలని చూస్తున్నాను. వచ్చిన ప్రతి వరుడూ కారణం ఫలానా అని చెప్పకుండానే వెళ్ళిపోతున్నాడు. ఆ భారం భరించలేకుండా ఉన్నాను. తమరే దీనికో పరిష్కారం చూపాలి,'' అన్నాడు కన్నీరు కారుస్తూ.

సన్యాసి తండ్రీ కూతుళ్ళను ఒకసారి ఆప్యాయంగా చూసి, చిన్నగా నవ్వుతూ విబూది ప్రసాదం ఇచ్చాడు.

ఇదంతా గమనించిన వ్యాపారి వేషంలోని రాజు ముందుకు వెళ్ళి, ''ఈ అమ్మాయి దేవికకు వివాహం ఎప్పుడు జరుగుతుందో చెప్పండి స్వామీ,'' అని వేడుకున్నాడు చేతులు జోడించి.

సన్యాసి ఆయన్ను ఒకసారి తేరిపారచూసి, మందహాసం చేశాడు. ఆ తరవాత మూడు క్షణాలు కళ్ళు మూసుకుని మెల్లగా తెరిచి, ''ఒకవారంలో దేవిక వివాహం జరుగుతుంది,'' అన్నాడు గంభీరంగా.

దేవికకు కలిసి వచ్చిన పెళ్ళి సంబంధాలే వెనక్కు వెళ్ళాయని ఆమె తండ్రి చెప్పాడు. మరి సన్యాసి ఏమో వారంలో వివాహమవుతుందని సెలవిచ్చాడు. ఎలా అవుతుందో చూడాలి. సన్యాసి గుట్టు రట్టు చేయడానికి ఇదో మంచి అవకాశం అనుకున్నాడు రాజు. ఆయన దేవిక తండ్రిని పక్కకు పిలిచి, తాను ఎవరైనదీ చెప్పి, ''నీ బిడ్డను నాతో పంపించు. వారం రోజుల పాటు అంతఃపురంలో ఏ కొరతా లేకుండా చూసుకుంటాను. ఆ తరవాత మంచి వరుణ్ణి చూసి ఆమెకు వివాహం




జరిపించే బాధ్యత నాది,'' అన్నాడు.

అందుకు రామయ్య సంతోషంగా ఒప్పుకున్నాడు. రాజు దేవికను రాజభవనానికి వెంటబెట్టుకుని వెళ్ళి, రాణికి అప్పగించి, వారం రోజుల పాటు ఏలోటూ రాకుండా చూసుకోమన్నాడు. లక్షణంగా ఉన్న దేవికను చూసి రాణి ముచ్చటపడి ఆమెకు సకల సదుపాయాలూ సమకూర్చమని పరిచారికలకు చెప్పింది.

వన్యమృగాలు పరిసరాలలోని గ్రామాల మీద పడి నానా బీభత్సం సృష్టిస్తున్నాయని ప్రజలు మొరపెట్టుకోవడంతో, రాజు మూడో రోజు రాజ్య సరిహద్దుల్లో ఉన్న అడవికి భటులతో వేటకు బయలుదేరాడు. రెండు రోజుల వేట తరవాత, రాజుకు హఠాత్తుగా రాజభవనంలో ఉన్న దేవిక జ్ఞాపకం వచ్చింది. ఈ

రోజుతో సన్యాసి చెప్పిన గడువు అయిపో తుంది. ఆయన బండారం బయటపడుతుంది అనుకుంటూ ఉత్సాహంగా రాజధానికి తిరుగుముఖం పట్టాడు.

రాజు రాజభవనంలో అడుగుపెట్టగానే ఎదురువచ్చిన రాణి సునందాదేవి, ''ప్రభూ, మీరు అటు వేటకు వెళ్ళగానే మన కుమారుడు అమరేంద్రుడు దేశసంచారం నుంచి తిరిగి వచ్చాడు. దేవికను చూసి ఆమె వివరాలు అడిగి తెలుసుకున్నాడు. నాకు కూడా తెలియకుండా ఆ అమ్మాయి అంగీకారంతో ఆమెను గాంధర్వ వివాహం చేసుకున్నాడు. తమతో చెబితే తమరు తగదని చెబుతారన్న అనుమానంతో ఇలా చేశాడట,'' అన్నది వినయంగా.

రాజు దిగ్భ్రాంతి చెందాడు. తూలి పడబోయి నిలదొక్కుకున్నాడు. తను అంతఃపురంలోనే ఉండి ఉన్నట్టయితే, ఈ వివాహం జరిగేది కాదు. మరికొంత సేపటికి భార్యా సమేతంగా వచ్చిన అమరేంద్రుడు తండ్రి పాదాలకు నమస్కరించాడు. వారంలో జరిగిన వివాహంతో సన్యాసి మహత్తును గ్రహించిన రాజుకు కుమారుడిపై కోపం కలగలేదు. విధి నిర్ణయం సన్యాసికి ముందే తెలిసినట్టుంది అనుకుంటూ తల పంకించాడు. నూతన వధూవరులను మనసారా ఆశీర్వదించాడు.

మరునాడు కొడుకూ కోడళ్ళను వెంటబెట్టుకుని రాజు సతీసమేతంగా సన్యాసి దర్శనానికి వెళ్ళాడు గాని, సన్యాసి అక్కడ కనిపించలేదు. మనసులోనే ఆయనకు నమస్కరించిన రాజు, అనుకోనివి సైతం జీవితంలో అరుదుగా జరుగుతూ ఉంటాయని అనుకున్నాడు.

-ఎన్.వి.ఆర్. సత్యనారాయణ మూర్తి





## కలపతో నిర్మితమైన మఠం



హిమాచల్‌ప్రదేశ్ లాహౌర్ స్పిటి జిల్లా, టుండే గ్రామ సమీపంలోని కొండమీద వెలసిన గురుఘంటాల్ మఠం 800 సంవత్సరాల నాటిది. త్రిలోకనాథ్ ఆలయం అని కూడా పిలువబడే ఈ మఠాన్ని గురు పద్మసంభవుడు నెలకొల్పాడు.

ద్రుక్పా కోవకు చెందిన ఈ మఠం కలపతో నిర్మితమైనది. ఈ మఠంలో బోధిసత్వ అవలోకితేశ్వర విగ్రహం ప్రధానమైనది. మఠం తెల్ల చలువరాతి శిఖరభాగాన్ని పద్మసంభవుడే ప్రతిష్ఠించాడు. ఈ మఠంలో గురుపద్మ సంభవుడు, బ్రిజేశ్వరీ దేవి, మరికొందరి లామాల విగ్రహాలు కూడా ఉన్నాయి.

## ఇంటింటా త్రాచుపాములు



పాములున్న ఇంట్లో కాపురం చేయగలమా? ఎవరినడిగినా సాధ్యపడదనే అంటారు. అయితే, మహారాష్ట్రలోని షోలాపూర్ జిల్లా, షెట్పాల్ గ్రామంలో ప్రజలు పాములతో సహజీవనం సాగిస్తున్నారు. త్రాచుపాములు ఇల్లంతా కలయ తిరుగుతున్నా ఇంతవరకు ఒకరినికూడా కాటేసినట్టుగానీ, దాని ద్వారా మరణించినట్టుగానీ దాఖలాలు లేవు!



ఈ జిల్లాలో పాముకాటు ప్రమాదం నుంచి ప్రజలను రక్షించే ఆలయాలు కూడా ఉండడం విశేషం. మోడింబ్ సమీపంలోని షెట్పల్‌లోని సిద్ధేశ్వర ఆలయంలో 1974వ సంవత్సరంలో వందమందికి పైగా పాముకాటుకు గురైన వారికి స్వస్థత సమకూరినట్టు ప్రజలు చెబుతున్నారు.





# పీష్వా వ్యూహం!

*మరాఠా రాజ్యం, సతారానగరం క్రీ.శ. 1727 మే నెల.*

కోట పైభాగంలోని చిన్న గదిలో మసకవెలుతురు, గాలి ఉద్వేగంతో నిండాయి. చేతిలో ఉత్తరాన్ని గట్టిగా బిగించి రాజు ఆందోళనతో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

''....చక్రవర్తి ఆజ్ఞను నెరవేర్చే ఉద్దేశంతో, షాహూ శత్రువైన కోల్హాపూర్ రాజా శంభూజీని తమ పక్షానికి తిప్పుకుని షాహూజీని శిక్షించి, తెగటార్చడానికి అతణ్ణి పురికొల్పాను. షాహూ తక్కిన అనుయాయులు సైతం త్వరలో అతణ్ణి వదిలిపెట్టగలరనీ, దాంతో అతడు శక్తిసామర్థ్యాలు డిగిపోయి ఉనికిని కోల్పోగలడనీ నమ్ముతున్నాను. దేవుడి దయతో చక్రవర్తి అభిమాన సహాయాలు పొంది మరాఠాలపై యుద్ధానికి దిగుతాను.''

''నమస్కారం, ప్రభూ! పీష్వాను.''

''భగవంతుడా! వచ్చావా పీష్వా, రా! నీ రాక నాకెంతో సంతోషం కలిగిస్తున్నది,'' అంటూ స్వాగతం పలికాడు రాజా షాహూ.

ఆ తరవాత, ''దీన్ని చదువు,'' అంటూ తన చేతిలోని లేఖను ఆయన చేతిలో పెట్టాడు. దాన్ని చదివిన పీష్వా, ''మొగలుల ప్రతినిధి మనల్ని పడగొట్టడానికి లభించిన అవకాశాన్ని జారవిడువకుండా ఒడిసిపట్టుకోవడంలో ఆశ్చర్యం లేదు. ఇది ఎదురుచూడ తగ్గదే,'' అన్నాడు.



''అయినా, అతడు దక్కనులో మన అనుయాయుడు కదా? షకర్ ఖండలో ముబారిజ్‌ఖాన్ ఓటమిని గురించి ఏమంటావు? ఆ విజయానికి నువ్వు సాయపడ్డావు కదా?'' అని బాధపడ్డాడు రాజు.

''నిజమే. ఢిల్లీ మొగల్ ఆస్థానంలో ప్రధానమంత్రి పదవికి అర్రులు సాచిన నిజాం-ఉల్-ముల్క్‌కు ఆశాభంగం కలగగానే, ఆ బాధను తగ్గించుకోవడానికి మనమీద పగ తీర్చుకోవాలనుకుంటున్నాడు. అంతే కాదు. సంయుక్తంగా కర్ణాటక మీద దండెత్తాలన్న మంతనాలు కూడా

సాగుతున్నాయి. శంభూజీని రెచ్చ గొట్టారంటే తమకు ఆశ్చర్యంగా లేదా?'' అని అడిగాడు.

''మనం ఎప్పుడూ యుద్ధాలు చేసుకునే శత్రువులుగా కొనసాగ వలసిందేనా?'' అని ఆశ్చర్యపో యాడు షాహూ.



''రాజా శంభూజీ మీ ప్రాంతాన్ని సంవత్సరాలుగా ఆక్రమించుకు న్నాడు. ఆయనా, ఆయన తల్లీ మీ ఆధిపత్యపు వాదనలను తిరస్కరిం చారు-అయినప్పటికీ వాళ్ళు అవాస్తవికమైన ఆశలతోనే ఉన్నారనుకుంటాను,'' అన్నాడు పీష్వా.

షాహూ చేతులు సాచి, ''ఇప్పుడేం చేయమం టావు మంత్రివర్యా?'' అని అడిగాడు.

''ఏ రాజూ యుద్ధాన్ని తప్పించుకోలేడు ప్రభూ! అయితే, దాని దారుణ పర్యవసానా లకు ప్రజలు బలికాకుండా తగు చర్యలు తీసు కోవచ్చు,'' అన్నాడు పీష్వా.

షాహూ ఉన్నట్టుండి వెనక్కు తిరిగి తత్తర పాటుతో, ''నువ్వు చిన్నవాడివి. నిన్నిలా అడిగే హక్కు నాకు లేదు. అయినా, అడగక తప్పడం లేదు. మరాఠాల గౌరవ ప్రతిష్ఠలు నీ చేతుల్లోనే ఉన్నాయి,'' అన్నాడు.

''వాటిని పరిరక్షించడం గొప్ప గౌరవంగా, మహద్భాగ్యంగా భావిస్తున్నాను, ప్రభూ!'' అన్నాడు పీష్వా బాజీరావు చిన్నగా నవ్వుతూ.

✻ ✻ ✻

*ఉత్తర మరాట్వాడా ప్రాంతం, జాల్నా పరిస రాలు క్రీ.శ. 1727.*

''వాళ్ళు పరిగెత్తడం చూడు!'' అంటూ సైనికుడు హేళనగా నవ్వాడు.

దక్కను నిజాం సైన్యాన్ని నడిపిస్తున్న ఇవాజ్ ఖాన్ హుంకరించాడు. ''అంటే పోరాడుతూన్న పీష్వా నిజాం దాడిని తట్టుకుని నిలబడలేకపోతు న్నాడన్న మాట! ఎలా నిలబడగలడు? ఒక్క దెబ్బతో పారిపోతున్నాడు!''

''వాళ్ళు ఏ దిక్కుకేసి పారిపోతున్నారు?'' అని అడిగాడతడు.

''ఉత్తరదిశగా ప్రభూ! బర్హన్‌పూర్ కేసి!'' అన్నాడు సైనికుడు నవ్వుతూ.

''వెంటబడి తరుము!''

✻ ✻ ✻

*పునా పరిసరాల్లో నిజాం ఖమూర్ అదిన్ చిన్ ఖిలిజ్‌ఖాన్ 1వ ఆసిఫ్ సైనిక శిబిరం, క్రీ.శ. 1728.*

''విజయపరంపర కొనసాగుతోంది ప్రభూ!'' అంటూ నవ్వాడు ఇవాజ్‌ఖాన్. అతడికెదురు గుండా దక్కన్ నిజాం, పిడికిలి బిగించి గడ్డాన్ని నిమురుకుంటూ, ''అంతే కదా-తుప్పుపట్టిన ఈటెలు, కత్తులు, విల్లంబులతో వాళ్ళేంచేయ గలరు? ప్రస్తుతం ఇంకా ఎన్ని ఉపసైనిక శిబి రాలు ఉన్నాయి?'' అని అడిగాడు.

''ఈ గొప్పదనమంతా అల్లాకే చెందుతుంది. ఉదాపూర్, అవసారీ, పాబల్, ఖేద్, నారాయణ ఘర్‌ను పట్టుకున్నాం ప్రభూ! సూపా, పటాస్, బారామతికేసి దూసుకు వెళుతున్నాం. మరా ఠాలు మట్టి కరవడం ఖాయం.''

''శభాష్,'' అంటూ నిజాం తన చేతుల్లోని స్ఫటికపు గిన్నెను పిడికిలిలో బిగించి ముక్కలు ముక్కలుగా చేస్తూ, ''అందాల నగరం ఔరంగ బాదును పోరాడుతూన్న పీష్వా చర్మంతోనూ, ఎముకలతోనూ అలంకరిస్తాను,'' అన్నాడు.

* * *

*కాసర్ బారీ కనుమ, పీష్వా బాజీరావు సైనిక శిబిరం క్రీ.శ. 1728 జనవరి.*

పడమటి కొండలలో సూర్యుడు అస్తమిస్తు న్నాడు. గుడారం లోపల సన్నగా ఉన్న ఒక యువకుడు వ్యూహాన్ని రచిస్తున్నాడు. ఆయన వేళ్ళు దేశపటం మీద కదులుతున్నాయి. ఆయన పక్కనే ఉన్న దళనాయకులు అలిసిపోయి విచారంగా కనిపిస్తున్నారు. ఒక దళనాయకుడు, ''శంభూజీ, చంద్రసేనుడు నిజాం పక్షం చేరారు. వాళ్ళు పలు సైనికశిబిరాలను వశపరచుకున్నారు ప్రభూ,'' అన్నాడు.

''ఈ యుద్ధంలో గెలవగలమనే నమ్మకం లేదు, ప్రభూ,'' అన్నాడు రెండవ దళనాయకుడు.

మెరుస్తూన్న కళ్ళతో వాళ్ళిరువురికేసి చూసిన పీష్వా బాజీరావు, ''సాహసం కన్నా దూరదృష్టి ప్రధానం అన్న పాత సామెత మీకు తెలియదా? నిజాం ప్రస్తుతం విజయాలు పొందవచ్చు. అయినా అవి అలాగే నిలబడజాలవు,'' అన్నాడు.

''అయినా వాళ్ళు పునాను కొల్లగొట్టారు. రాజుగారే మనల్ని వెనక్కు రమ్మంటున్నారు...''

''మనం వదిలిపెట్టడం లేదు. వాళ్ళకు అందకుండా ముప్పతిప్పలు పెడుతున్నాం. వాళ్ళిప్పుడు తమ విజయాలను తలుచుకుంటూ ఆదమరచి ఉన్నారు. దెబ్బ తీయడానికి ఇదే సరైన తరుణం!'' అన్నాడు పీష్వాబాజీరావు.

* * *

*పాల్ఖెద్ నిజాంకమర్ అదిన్ సైనికశిబిరం క్రీ.శ. 1728 ఫిబ్రవరి 28.*



ముగ్గురు వ్యక్తులు ఎదురె దురుగా నిలబడి ఉన్నారు. వాళ్ళ ముఖాలు దిగ్భ్రాంతితో వెలవెలబోతున్నాయి. ''వెనుక భాగాన్నీ, పార్శ్వాలనూ రక్షించు కుంటామని మీరు చెప్పారు కదా! మరి ఇప్పుడు బాజీరావు వచ్చి పడ్డాడే, మీ వ్యూహరచనా సామర్థ్యాలు ఏమయ్యాయి?'' అని ప్రశ్నించాడు నిజాం ఆవే శంగా.

''అతడు ఔరంగబాదు మీద

దాడి చేయగలడని ఊహించలేకపోయాం,'' అన్నాడు చంద్రసేనుడు.

''బాజీరావు సైనికులు ఫిరంగులు, చేతితుపాకులు, సంచులు లాంటి బరువులు లేకుండా ప్రధాన పట్టణాలను స్పృశించకుండానే చకచకా ముందుకు దూసుకువెళుతున్నారు, తెలుసా?'' అన్నాడు శంభూజీ.

''తూర్పు, పడమర, ఉత్తరం మూడు వైపుల నుంచీ ముట్టడి సాగిస్తున్నాడు. ప్రతి సైనిక శిబిరం వద్దా మనమీద పైచేయి సాధిస్తున్నాడు. అతడు వెనక్కు తిరిగి పారిపోతున్నాడనుకున్నాం. ఇప్పుడు మనల్ని కావాలనుకున్న చోటికి-ఆహార పానీయాలు లభ్యం కానిచోటికి వేటాడి తరుముతున్నాడు. నా సైనికులు ఇక యుద్ధం చేయలేరు!'' అన్నాడు నిజాం.

''ఇప్పుడేం చేద్దాం,'' అని అడిగాడు చంద్రసేనుడు ఆఖరిగా. అంతలో ఇవాజ్‌ఖాన్ ఆయన అనుమతితో అక్కడికి వచ్చాడు. ''మన దయనీయ దుస్థితిని గురించి పీష్వాబాజీరావుకు వర్తమానం పంపండి. ఆయన ఎలాంటి నియమనిబంధనలు విధించినా అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నామని చెప్పండి,'' అన్నాడు నిజాం.

✻ ✻ ✻

*సతారా నగరం సభామంటపం క్రీ.శ. 1728 మార్చ్ 25.*

''..... ముంగీ-పైథాన్‌లో ఈ విధమైన ఒప్పందం సంతకం చేయబడింది: రాజా షాహూ మా నిజమైన ఛత్రపతి. ఆరు ప్రాంతాలకు చెందిన చౌత్, సర్దేశ్‌ముఖి పూర్తిగా వియుక్తమవుతాయి. వాటితో పాటు ఆక్రమించుకున్న ఉపశిబిరాలన్నీ మరాఠాల పరిరక్షణకు అప్పగించబడతాయి.''



దూత ఒప్పందంలోని అంశాలను చదువుతూండగా సభాసదుల హర్షధ్వానాలతో సభామంటపం మారుమోగింది. సింహాసనం నుంచి లేచి నిలబడ్డ రాజా షాహూ, ''విజయాలతో తిరిగి వచ్చిన ధీరుడైన పీష్వాను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను,''అని ఆయన కేసి తిరిగి, ''అవును బాజీరావు, బలమైన చెట్టుకొమ్మల్లా మనల్ని కమ్ముకున్న శత్రువును ఎలా పడగొట్టావు?'' అని అడిగాడు.

ఛత్రపతికేసి కొంతసేపు చూసిన పీష్వా తల పంకించి, ''చెట్టు మొదలును నరికితే కొమ్మలు వాటంతట అవే పడిపోతాయి కదా ప్రభూ! నా సలహాను విన్నట్టయితే అట్టోక్ మీద మరాఠా బావుటాను ఎగురవేయగలను,'' అన్నాడు ఉత్సాహంగా. సభామంటపం మళ్ళీ హర్షధ్వానాలతో ప్రతిధ్వనించింది.

''అలాగే! చాలా సంతోషం! నువ్వు దాన్ని హిమాలయాలపై ఎగురవేయవచ్చు!'' అన్నాడు షాహూ నవ్వుతూ. -పవిత్రాశ్రీనివాసన్



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరువాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

    

| English | School | Book | Cat | Write | Number |
|---|---|---|---|---|---|
| Telugu | బడి | పుస్తకం | పిల్లి | రాయడం | సంఖ్య |
| Hindi | पाठशाला<br>పాఠశాలా | पुस्तक<br>పుస్తక్ | बिल्ली<br>బిల్లీ | लिख<br>లిఖ్ | संख्या<br>సంఖ్యా |
| Tamil | பள்ளி<br>పళ్ళి | புத்தகம்<br>పుత్తగం | பூனை<br>పూనై | எழுது<br>ఎళుదు | எண்<br>ఎణ్ |
| Bengali | বিদ্যালয়<br>బిద్యాలయ్ | বই<br>బయి | বিড়াল<br>బిడాల్ | লেখা<br>లేఖా | সংখ্যা<br>సంఖ్యా |
| Marathi | शाळा<br>శాలా | पुस्तक<br>పుస్తక్ | मांजर<br>మాంజర్ | लिहा<br>లిహా | संख्या<br>సంఖ్యా |
| Kannada | ಶಾಲೆ<br>శాలె | ಪುಸ್ತಕ<br>పుస్తక | ಬೆಕ್ಕು<br>బెక్కు | ಬರೆಯುವುದು<br>బరెయువుదు | ಸಂಖ್ಯೆ<br>సంఖ్యె |
| Oriya | ବିଦ୍ୟାଳୟ<br>బిద్యాలయ | ବହି<br>బహి | ବିଲେଇ<br>బిలెయ్ | ଲେଖ<br>లేఖ | ସଂଖ୍ୟା<br>సంఖ్యా |
| Gujarati | શાળા<br>శాలా | ચોપડી<br>చోపడీ | બિલાડી<br>బిలదీ | લખવું<br>లఖ్వుమ్ | આંકડા<br>ఆంకడా |
| Assamese | বিদ্যালয়<br>బిద్యాలయ్ | কিতাপ<br>కితాప్ | মেকুৰী<br>మెకూరీ | লিখা<br>లిఖా | সংখ্যা<br>హాంగ్ఖ్యా |
| Malayalam | വിദ്യാലയം<br>విద్యాలయం | പുസ്തകം<br>పుస్తకం | പൂച്ച<br>పూచ్చా | എഴുതുക<br>ఎళుతుక | സംഖ്യ<br>సంఖ్య |
| Santali | ᱟᱥᱲᱟ<br>ఆస్డా | ᱯᱚᱛᱚᱵ<br>పోతోబ్ | ᱯᱩᱥᱤ<br>పుసి | ᱚᱞᱢᱮ<br>అల్మే | ᱮᱞᱮᱞ<br>ఎలెల్ |
| Sanskrit | विद्यालयः<br>విద్యాలయః | पुस्तकम्<br>పుస్తకం | मार्जालः<br>మార్జాలః | लिख<br>లిఖా | संख्या<br>సంఖ్యా |



కింద ఇచ్చిన ఐటలిక్స్‌లోని పదాలను గమనించండి. పై జాబితా సహాయంతో వాటి అర్థాలకు అనుగుణంగా ఖాళీలను నింపండి!



1. మా బిద్యాలయ్‌లో ..... మంది విద్యార్థులు చదువుతున్నారు.

మీకు ఇష్టమైన వాల్‌పేపర్లను telugu.chandamama.com కు వెళ్ళి తీసుకోండి

    

| English | Game | Friend | Mango | Science | Mother |
|---|---|---|---|---|---|
| Telugu | ఆట | స్నేహితుడు | మామిడి | విజ్ఞానం | అమ్మ |
| Hindi | खेल<br>ఖేల్ | दोस्त<br>దోస్త్ | आम<br>ఆమ్ | विज्ञान<br>విజ్ఞాన్ | माँ<br>మాఁ |
| Tamil | விளையாட்டு<br>విళైయాట్టు | நண்பன்<br>నణ్బన్ | மாங்காய்<br>మాంగాయ్ | விஞ்ஞானம்<br>విజ్ఞానం | அம்மா<br>అమ్మా |
| Bengali | খেলা<br>ఖెలా | বন্ধু<br>బంధు | আম<br>ఆమ్ | বিজ্ঞান<br>బిజ్ఞాన్ | মা<br>మా |
| Marathi | खेळ<br>ఖేల్ | मित्र<br>మిత్ర | आंबा<br>ఆంబా | शास्त्र<br>శాస్త్ర | आई<br>ఆయీ |
| Kannada | ಆಟ<br>ఆట | ಸ್ನೇಹಿತ<br>స్నేహిత | ಮಾವು<br>మావు | ವಿಜ್ಞಾನ<br>విజ్ఞాన | ಅಮ್ಮ<br>అమ్మ |
| Oriya | ଖେଳ<br>ఖేల | ସାଙ୍ଗ<br>సాంగ | ଆମ୍ବ<br>ఆంబ | ବିଜ୍ଞାନ<br>బిజ్ఞాన | ମା<br>మా |
| Gujarati | રમત<br>రమత్ | મિત્ર<br>మిత్ర | કેરી<br>కెరీ | વિજ્ઞાન<br>విజ్ఞాన్ | મા<br>మా |
| Assamese | খেল<br>ఖేల్ | বন্ধু<br>బంధు | আম<br>ఆమ్ | বিজ্ঞান<br>బిజ్ఞాన్ | মা<br>మా |
| Malayalam | കളി<br>కళి | കൂട്ടുകാരൻ<br>కూట్టుకారన్ | മാങ്ങ<br>మాంగా | ശാസ്ത്രം<br>శాస్త్రం | അമ്മ<br>అమ్మ |
| Santali | ᱮᱱᱮᱡ<br>ఏనెజ్ | ᱡᱚᱴᱟᱣ<br>జొటావ్ | ᱩᱞ<br>ఊల్ | ᱥᱟᱱᱮᱥ<br>సాణేశ్ | ᱟᱭᱚ<br>ఆయో |
| Sanskrit | क्रीडा<br>క్రీడా | मित्रम्<br>మిత్రమ్ | आम्रम्<br>ఆమ్రమ్ | विज्ञानम्<br>విజ్ఞానం | माता<br>మాతా |



2. నా అభిమాన పాత్రోబ్ .................
3. మాంజర్‌కు ......................... తినడం అంటే ఇష్టం.
4. ఒరియాలో లేఖా అంటే .................. అని అర్థం.
5. నా అదృష్ట ఆంకడా ......................
6. ఇండోర్ ఖెలాకు ....................... ఒక ఉదాహరణ.
7. నా కూట్టుకారన్, నేనూ .................... ఏళ్ళుగా ఒకరికొకరం తెలుసు.
8. నా అభిమాన మామిడి రకం ....................
9. జీవుల గురించి అధ్యయనం చేసే విజ్ఞానంలోని ఒక శాఖను .................... అని అంటారు.
10. మా అమ్మకు ......................... ధరించడం అంటే ఇష్టం.

# పాతాళదుర్గం-16




[ధూమకుడూ వాళ్ళు, రాక్షసుల కనుగప్పి కొండలకేసి పరిగెత్తారు. అక్కడ వారికొక జలపాతం కినిపించింది. సోమకుడు దాహం తీర్చుకునేందుకు పోగానే, నీటిధార కట్టుబడిపోయి, అక్కడ నిలువెత్తు ద్వారం కంటబడింది. అమితాశ్చర్యంతో వాళ్ళు దాన్ని సమీపించగానే అది మెల్లగా తెరుచుకున్నది. లోపల భుగభుగమని అగ్నిజ్వాలలు లేస్తున్నవి. -తరవాత]

గుహలోని అగ్నిజ్వాలలను చూస్తూనే, ధూమకుడు ద్వారం వద్ద ఆగిపోయాడు. సోమకుడూ, విరూపుడూ తమతమ ఆయుధాలను చేతుల్లోకి తీసుకున్నారు. విరూపుడి భుజం మీద ఉన్న నల్లగరుడపక్షి రెక్కలు తపతపలాడిస్తూ ఎగిరిపోయేందుకు ప్రయత్నించింది.

''కాలశంబర మాంత్రికదొర ఎక్కడ? జలపాతం మంత్రించినట్టు కట్టుబడిపోయిందేం? ఈ మంట లేమిటి? ఇందులో ఏమన్నా మోసం లేదు కదా?'' అంటూ విరూపుడు ఒకడుగు ముందుకు వేసి, ధూమకుడి భుజం మీదుగా గుహ లోపలికి తొంగి చూశాడు. ''ఎవరది! ఆటవికనాయకుడు విరూపుడా?'' అన్న ప్రశ్నతోపాటు, జ్వాలల వెనక కాలశంబర మాంత్రికుడి రూపం ప్రత్యక్షమయింది.

విరూపుడు రెండు చేతులూ ఎత్తి మాంత్రికుడికి నమస్కరిస్తూ గుహ ద్వారం దగ్గిరకు వచ్చి, పాదాలపై పడ్డాడు. కాలశంబరుడు విరూపుణ్ణి దీవిస్తున్నట్టు చేయెత్తి, ''ఈ ఇద్దరూ ఎవరు?'' అని ఆశ్చర్యపడుతున్నవాడిలా ప్రశ్నించి, విరూపుడు లేచి జవాబిచ్చేంతలో, ''మీరు కదంబదేశపౌరులు కదా? మీ

రాజు ఉగ్రసేనుడు ఎలా ఉన్నాడు? మీ రాజ్య సరిహద్దుల్లోని కొండ దగ్గిర అంత గురిగా నా ముంజేతిలో బాణం కొట్టిన వాళ్ళెవరు, మీ ఇద్దర్లో?'' అని ప్రశ్నించాడు.

కాలశంబర మాంత్రికుడితో స్నేహం కలప టానికి ఇదే మంచి తరుణం అనిపించింది, ధూమకుడికి. అతడు ముందుకొక అడుగు వేసి మాంత్రికుడికి నమస్కరిస్తూ, ''మహా మాంత్రికా! ఆ కొండ ప్రాంతంలో చీకటి మాటున ఎవరెవరో తెలియని స్థితిలో పెద్ద పొరపాటు జరిగిపోయింది. అందుకు నా తరఫునా, నా అనుచరుడు సోమకుడి తరఫునా క్షమాపణ కోరుతున్నాను. ఇదుగో, మీ మంత్రదండం! దీని సహాయంతోనే, ఎన్నో ఆపదలు గడిచి మేమిక్కడికి రాగలిగాం'' అన్నాడు.

కాలశంబర మాంత్రికుడు మంత్రదండాన్ని అందుకుని, కళ్ళ కద్దుకుని, ''గతాన్నంతా మరిచిపోదాం. ఇప్పుడు జరగవలసిన కర్మ కాండ చాలా ఉన్నది. మీరు గుహలోకి వచ్చే యండి,'' అన్నాడు.

ధూమకుడూ వాళ్ళు గుహలోకి అడుగు పెట్టారు. ఆ వెంటనే గుహద్వారాన్ని రాతిపలక మూసేసింది. తిరిగి ఎప్పటిలాగా జలపాతం పెద్ద ధ్వనితో ద్వారాన్ని కప్పివేస్తూ ప్రవహించ సాగింది. మాంత్రికుడు అగ్నిజ్వాలలున్న గుహ నుంచి మరొక గుహలోకి దారి తీశాడు. అక్కడ పైనుంచి వెలుగు బాగా ప్రసరిస్తు న్నది. ఆ గుహలో నుంచి ఏటవాలుగా భూగ ర్భంలోకి ఒక దారి ఉన్నది. దాని వెంట మాంత్రి




కుడు, ధూమకుడూ వాళ్ళను దిగువకు తీసుకుపోయాడు.

అక్కడ నేల సమతలంగా ఉన్నది. మను షులు నివసించటానికి అనువుగా, కొండ రాతిలో కొన్ని గదులు ఏర్పాటు చేయబడినై. వాటి ముందున్న ఆవరణలో కొందరు రక రకాల పరికరాలతో పనులు చేస్తున్నారు. పెద్దపెద్ద రోళ్ళల్లో కొందరు ఆకులూ, చెట్ల వేళ్ళూ వేసి రోకళ్ళతో దంచుతున్నారు. మరి కొందరు ఆ దంచిన దినుసుల్ని పోగుచేసి తెచ్చి చాపల మీద ఆరబెడుతున్నారు.

కాలశంబర మాంత్రికుడు వెనుదిరిగి తన వెంట ఉన్న వాళ్ళకేసి చిరునవ్వు నవ్వుతూ చూసి, ''ఇదంతా ఏమిటని మీకు ఆశ్చర్యం కలుగుతున్నది గదా?'' అని అడిగాడు. అవునన్నట్టు ధూమకుడు తలాడించాడు.




"ఈ పనులు చేసేవాళ్ళంతా కుంతల దేశ మంత్రి గంగాధరుడు పంపినవాళ్ళు. వీళ్ళ నాయకుడు భద్రుడు మరికొందరితో కలిసి కొండపైకి వెళ్ళాడు. ఇప్పుడు మనం ఉన్నది, కొండగర్భం. మహాకలి రాక్షసుడిది పాతాళ దుర్గం అయితే, మనది కొండగర్భదుర్గం. ఆ దుర్మార్గుణ్ణి దుర్గంతో పాటు సర్వనాశనం చేయటానికి ఏర్పాట్లు పూర్తి అవుతున్నవి," అన్నాడు కాలశంబర మాంత్రికుడు.

"భద్రుడు మీరున్న చోటుకు ఎలా రాగలిగాడు?" అని ప్రశ్నించాడు ధూమకుడు ఎంతో ఆశ్చర్యపడుతూ.

"ఇక్కడి కతను చుట్టుదారిన వచ్చాడు. మీరు సాహసంతో నానాకష్టాలూ పడి దగ్గిర దారిన వచ్చారు. మీకు అరణ్యంలో విరూపుడి ఆటవికులు సహాయం చేసినట్టే, అతడికి మరికొందరు సహాయపడ్డారు," అన్నాడు కాలశంబరుడు.

"ఈ ఓషధులెన్నీ ఏమిటి కాలశంబర దొరా?" అని అడిగాడు విరూపుడు.

"రాక్షస సంహారానికి ఉపయోగించే ఆయుధాల్లో ఇవి ముఖ్యమైనవి. నువ్వాటవికుడివి కదా? ఒక్కొక్క ఆకులో, వేరులో ఎంతటి మహత్తర ప్రాణదాన దహన శక్తులుంటవో నీకు తెలియంది కాదు," అన్నాడు మాంత్రికుడు.

అప్పటివరకూ ఒక ప్రశ్న అడుగుదామని ఉగ్గబట్టుక్కూచున్న ధూమకుడు, మాంత్రికుణ్ణి, "మహా మాంత్రికా! రాకుమారి కాంతిసేన క్షేమమా?" అని అడిగాడు.

"క్షేమమే. మంత్రి గంగాధరుడి కొడుకు శశికాంతుడి క్షేమసమాచారాలడగవేం? అతడి గాయాలకు మందు మంత్రాలు ప్రయోగించి నయం చేశాను. కాని, అరణ్యంలో, గూడేల పైకి మనుషుల వేటకై వచ్చిన రాక్షసబంట్ల చేతిలో అతడు చిక్కిపోయాడు. నేను తప్పించుకోగలిగాను. అతడిప్పుడు కాంతిసేనతో పాటు మహాకలిరాక్షసుడి చెరలో ఉన్నాడు. చెరలో ఉన్న ఆ ఇద్దరూ ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకున్నారట... అదేదో నాకేమాత్రం అర్థంకాని సంగతనుకో..." అంటూ మాంత్రికుడు, విరూపుడికేసి తలతిప్పి కనుబొమలు ఎగరవేశాడు.

ఒక క్షణకాలం నిశ్శబ్దం. మహాకలిని హతమార్చటానికి మాంత్రికుడు వేసిన పథకం ఏమిటో ధూమకుడికి అంతుపట్టలేదు.

అతడి దృష్టిలో అందుకు రెండే రెండు మార్గా లున్నవి. ఒకటి: పెద్ద సైన్యంతో వచ్చి అతణ్ణి యుద్ధంలో ఓడించటం. రెండు: ఏదో కుతంత్రంపన్ని అతణ్ణి ఒంటరిగా దొరకపుచ్చుకుని హతమార్చటం.

ధూమకుడిలా ఆలోచించి మాంత్రికుణ్ణి ఏదో అడగబోయేంతలో, కొండపైకి పోయేందుకున్న మెట్లమీంచి ఇద్దరు యువకులు కుప్పించి దూకుతూ అక్కడికి వచ్చారు. ఇద్దరూ జంతుచర్మాలు ధరించి ఉన్నారు. నడుం నుంచి కత్తులు వేల్లాడుతున్నవి.

వాళ్ళు ధూమకుడూ అతడి అనుచరుల్ని చూస్తూనే, ఎవరు వీళ్ళు? అన్నట్టుగా మాంత్రికుడికేసి చూశారు. మాంత్రికుడు తల పంకిస్తూ, ''భద్రా! నువ్వు చెప్పదలిచిందేదో చెప్పవచ్చు. వీళ్ళు మనమిత్రులే, కదంబదేశ పౌరులు. రాకుమారి కాంతిసేన రక్షణకై వచ్చారు,'' అన్నాడు.

''రాకుమారి రక్షణ రాక్షసులే చూస్తున్నారు. మనం రక్షించవలసింది శశికాంతుణ్ణి. వాళ్ళు మహాకలిరాక్షసుడి తండ్రి శతవర్ధంతికి ఏర్పాట్లన్నీ పూర్తి చేస్తున్నారు. రేపు మధ్యాహ్నం ఒంటి గంట వేళ ఆ తంతు ప్రారంభమవుతుంది, శశికాంతుడి శిరశ్ఛేదంతో అది ముగుస్తుంది,'' అన్నాడు భద్రుడు.

''నా తండ్రిని చంపినంత తేలిగ్గా మహాకలి శశికాంతుణ్ణి చంప లేడు. రేపు సూర్యాస్తమయం లోపల దండకారణ్యంలో రాక్షస కీటకం అనేది లేకుండా చేయబోతున్నాను. నా తండ్రి హత్యకు ప్రతీకారం చేసి తీరుతాను.




పదండి, ఆ దుర్మార్గుడి ప్రయత్నాలేమిటో నేనూ స్వయంగా చూస్తాను,'' అంటూ కాలశంబర మాంత్రికుడు కాళ్ళతో నేలను తాటించి, పళ్ళు కొరుకుతూ బయలుదేరాడు.

కొండగర్భంలో ఉన్న రహస్య మార్గాల వెంట ఒక అరగంట కాలం నడిచి అందరూ ఒక శిఖర ప్రాంతాన్ని చేరారు. ఆ శిఖరం మీద మహావృక్షాలెన్నో ఉన్నవి. వాటి నిండా అల్లిబిల్లిగా అడవితీగలు అల్లుకుని ఉన్నవి. మాంత్రికుడు నిశ్శబ్దంగా ముందుకుపోయి గుబురుగా ఉన్న ఒకచెట్టు ఆకులను మెల్లగా పక్కలకు తొలిగించి దిగువకు చూశాడు. అతడికి పాతాళదుర్గం, అందులోని భవనాలూ, వాటి ముందున్న మైదానప్రదేశం, అందులో వంటలూ వార్పులకూ, వినోదాలకూ రాక్షసులు చేస్తున్న ఏర్పాట్లూ కనిపించినై.



కాలశంబర మాంత్రికుడు కొంచెంసేపు కన్నార్పకుండా వాటికేసి చూసి, తరవాత తలతిప్పి, ధూమకుడూ అతడి అనుచరుల్ని దగ్గిరకు రావలసిందిగా సంజ్ఞచేశాడు. వాళ్ళు నిశ్శబ్దంగా అతడి దగ్గిరకు వెళ్ళారు. మాంత్రికుడు వాళ్ళకు పాతాళదుర్గం చూపించాడు. ఆ దుర్గం మీద సూటిగా సూర్యకాంతి ప్రసరించటం లేదు. కాని ఏదో చీకటీ వెలుగూ కాని సంధ్యాకాంతిలాంటిది ఆ దుర్గ ప్రదేశాన్నంతా ఆవరించి ఉన్నది.

''ఇదా పాతాళదుర్గం! ఇక్కడా ఆ క్రూరుడు మహాకలి నివసించేది!'' అన్నాడు ధూమకుడు.

''అవును. కాని రేపు సూర్యాస్తమయంతో వాడి దుర్గమూ, వాడూ కూడా మట్టిలో కలిసి పోతారు, నా తండ్రి ఆత్మకు శాంతి కలుగుతుంది. ఇంత కాలంగా ఈ కార్యం ఒంటరిగానే సాధించాలన్న మూర్ఖపు పట్టుదలలో ఉండిపోయాను. ఎంత గొప్ప మాంత్రికుడికయినా అది సాధ్యంకాని పని. కేవలం మంత్రంతో అయ్యేదికాదు; తంత్రం కూడా ప్రయోగించాలి. అందుకు భద్రుడు నాకెంతగానో తోడ్పడ్డాడు,'' అన్నాడు కాలశంబర మాంత్రికుడు.

ఆ తరవాత అందరూ అక్కణ్ణించి వెనుదిరిగారు. మాంత్రికుడు ముందుండి దారి తీస్తూ, లోగడ వచ్చిన మార్గాన కాకుండా మరోదారిన నడవసాగాడు. ఓ పావు గంట అలా నడిచి అతడు ఒక పెద్ద చెట్టుబోదెను సమీపించి, దాని మీద గుప్పెటతో బలంగా నొక్కాడు. చెట్టుబోదెలో మనిషి దూరి అవతలికి పోవటానికి వీలయినంత పెద్ద కంత ఏర్పడింది. మాంత్రికుడు ఆ కంతలో నుంచి

అవతలికి చూసి, ధూమకుడూ వాళ్ళను దగ్గిరకు రమ్మని పిలిచాడు. ధూమకుడు ఆ కంతలోంచి చూస్తూనే అదిరిపడ్డాడు. అతడికి కలలో కూడా ఊహించని ఒక వింత దృశ్యం కళ్ళబడింది.

అది ఒక పెద్ద సరోవరం. దాని ఒడ్డునున్న ఒక చెట్టు కింద కుంభీరుడు కూర్చుని ఉన్నాడు. అతడికి అల్లంత దూరంలో రాజకుమారి కాంతిసేన, మరొక భిల్లస్త్రీతో కలిసి సరోవరతీరం వెంట విహరిస్తున్నది.

''కాంతిసేన! కాంతిసేన!'' అంటూ ధూమకుడు ఆవేశంతో కేకపెట్టబోయి తమాయించుకున్నాడు. అతడు కాలశంబరుడికేసి తిరిగి, ''రాకుమారి క్షేమంగానే ఉన్నది. ఆ చెట్టు కింది రాక్షసుడు ఆమెను రాజప్రాసాదం నుంచి ఎత్తుకుపోయిన కుంభీరుడే కదా? రాకుమారి వెంట ఉన్న ఆ స్త్రీ ఎవరు?'' అని అడిగాడు.

''ఆ ఆడది భిల్లనాయకుడు పులిందుడి పడుచు పదో పెళ్ళాం, సందేహం లేదు,'' అన్నాడు విరూపుడు.

''పులిందుడి పెళ్ళామా? ఈ సంగతి నాకు తెలియదే. తాను కన్యననీ, మహాకలి రాక్షసుడు, రాకుమారి కాంతిసేనతో పాటు తననూ పెళ్ళాడబోతున్నాడనీ, తాను పాతాళ దుర్గ పట్టమహిషిననీ అందరితో చెప్పుకుంటున్నది,'' అన్నాడు కాలశంబరమాంత్రికుడు.

ధూమకుడా మాటలకు ఏదో జవాబు చెప్పబోయేంతలో, కుంభీరుడు చుట్టూ ఓమారు చూసి, లేచి నిలబడి, రాతిగదను భుజాన పెట్టుకుని, చెట్టుబోదె కేసి పెద్దపెద్ద అంగలు వేస్తూ రాసాగాడు. *-(ఇంకాఉంది)*







# యుద్ధ మండలి

*[''మానవజాతి ప్రార్థించే సమయం ఎప్పుడో దాటిపోయింది,'' అంటూ మందహాసం చేసింది మయూరి. ఆకాశంలో మెరుపు మెరిసింది. వేటాడబడే లేడిపిల్లలా నా గుండెల్లో భయం పరుగులు తీయసాగింది.]*

ఆమె మరణసదృశ స్వప్ననేత్రాల్లోకి చూస్తూంటే భావాతీత లోకంలోకి పడిపోతూన్న అనుభూతి కలిగింది. సంతృప్తికరమైన చెట్టుకొమ్మల్లా మయూరి హస్తాలు ఆకాశం నేపథ్యంగా మెల్లగా కదలాడసాగాయి. అయినా ప్రశాంతమైన ఆమె మోములో, కళ్ళెదుట ఉన్నవాటంతటినీ నిర్మూలించగలనని హడలగొట్టేంత ప్రాచీన ఆగ్రహం కూడా పొంచి ఉందని నాకు తెలుసు.

''నన్ను క్షమించు,'' అన్నాను తడబడే కంఠస్వరంతో. నేనెందుకు క్షమాపణ చెప్పానో కూడా తెలియలేదు. అయినా నన్ను కిందికి గుంజుతూన్న తీవ్రమైన అపరాధభావం నుంచి బయట పడలేకపోయాను. ''నువ్విక్కడికి రావలసివచ్చినందుకు విచారిస్తున్నావా?'' అన్న ఆమె ప్రశ్న నా వెన్నులో పాములా ఎగబ్రాకింది. అప్పటికే ఆకాశం రాకాసి ఎరుపురంగు పులుముకుంది. నెత్తురోడుతున్న సూర్యుడు అప్పుడే అస్తమించాడు. వేగంగా రాత్రి వచ్చేస్తోంది. చీకటి నేను అనుభవిస్తున్న అవమానాన్ని కప్పేస్తుంది.

''అతడు కుర్రాడు. ఆ విషయం గుర్తుంచుకో,'' అన్నది గువ్వా. మయూరి నెమ్మదిగా ఆమెవైపు తిరిగి, ''అయినా, అతడు పెరిగి పెద్దయి వాళ్ళల్లో ఒకడవుతాడు. భూమిని సొంతం చేసుకుని జంతువులకు, పక్షులకు పేర్లు పెడతాడు. నన్ను చూడగానే నక్క వినయాలు నటించే వాడవుతాడు,'' అన్నది.



డైనోజార్లు భయంతో వణికిపోతున్నాయి. అయితే చీనా ఏనుగు మాత్రం మయూరి కేసి ఆశగా చూస్తూ నవ్వుతున్నది. ''ఎలాంటి ప్రవర్తన! ఎంత లోతైన వ్యక్తిత్వం!'' అన్నాడు. ''అదిచాలు. కృతజ్ఞతలు,'' అన్నది మయూరి సంతోషంగా. ఆ తరవాత ఆమె మళ్ళీ నాకేసి తిరిగి, ''నీ



వయసెంత బాబూ?'' అని అడిగింది. ''పదిహేను!'' ''అంటే ఇంచుమించు యుక్తవయస్కుడివన్నమాట!'' అన్నది మయూరి.

''నువ్వతణ్ణి వాళ్ళ నుంచి కాపాడగల వని మాట ఇచ్చావు,'' అన్నది గువ్వా.

నేను ఆమెకేసి కృతజ్ఞతగా చూశాను.

''అతడివల్ల హాని రాదు. మనల్ని నమ్ముతున్నాడు. మనుషులందరూ దుర్మార్గులు కారు. నువ్వు కూడా ఒక ప్పుడు మనిషివన్న సంగతి మరిచి పోవద్దు!'' అన్నది లెమన్.

మయూరి ముఖం నుంచి ఆగ్రహజ్వాల వెలువడింది. ''నేనెప్పుడూ మనిషిని కాను. దాన్ని మరిచిపోవద్దు,'' అన్నది.

లెమన్ మరి మాట్లాడలేదు. మౌనం వహిం చింది. వాతావరణం రాబోయే గొడవలకు సూచ నగా ఉద్విగ్నభరితంగా తయారయింది. ''ఆఖ రికి నేను మిమ్మల్ని కాపాడుతాను. మీరు అడి గారని కాదు. పగ, ప్రతీకారం మానవ లక్షణం. అందులో నేను భాగస్వామిని కాలేను గనక,'' అన్నది మయూరి గంభీరంగా.

నేను గట్టిగా ఊపిరి పీల్చుకుని తెరపిని పడ్డాను. ఎంతో ఉపశమనం కలిగింది. కృతజ్ఞతగా కిందికి వంగాను. అనునిర్వలో మయూరికున్న మొత్తం శక్తి, అధికారం ఏమిటో నాకు తెలియదు. అయితే, అక్కడ రాణి అంటూ ఉంటే అది ఆమే అయివుంటుంది. ''ఏమి హుందాతనం!'' అన్నది చీనా ఏనుగు. గాల్లో గబ్బిళాల్లా వేలా డుతూ ముంచుకు వస్తూన్న ఆపదల గురించి అది కించిత్తు కూడా భయపడేదానిలా కనిపిం చడం లేదు.

''నువ్వునాతో యుద్ధమండలి వద్దకు వస్తు న్నావు. అక్కడ వాదాలు ఎలా ఉన్నా, నువ్వు నోరు మెదపకూడదు. నువ్వు పుట్టడానికి ముందె న్నడో మీ వినాశనం ప్రస్ఫుటంగా నక్షత్ర రజంతో రాయడం జరిగిపోయింది. కాలం తానంతట ఎంపిక చేసిన దాన్ని మార్చడం కష్టం. గతంలో కలిసిపోయిన గంటలు, నిమిషాలు, క్షణాలను లేకుండా చేయడం కష్టం. అయితే, నేను ప్రయ త్నిస్తాను,'' మయూరి నోటి నుంచి వెలువడిన ఒక్కొక్క మాటా వాతావరణాన్ని కొద్ది కొద్దిగా తేలిక పరిచినట్టయింది.

నెత్తురోడుతూన్న సూరీడు పూర్తిగా కను మరుగయ్యాడు. అనునిర్వకేసి సూటిగా చూడ డానికి భయపడుతున్నట్టుగా నల్లటి మేఘం చాటున వెలవెలబోతూన్న చంద్రుడు తొంగి చూస్తున్నాడు.

మయూరి కొండలకేసి బయలుదేరింది. అందరూ ఉన్నచోటే ఉండిపోయారు. నేను మాత్రం ఆమెవెంట బయలుదేరాను. పరు గులాంటి నడకను అందుకున్నాను. అలా ఇసుక తిన్నెలగుండా వెళుతూంటే నేనెంతో

స్వల్పుడిననిపించింది. దారిలో ఎదురైన ప్రతి ఒక్కటీ ప్రతి గడ్డిపోచా, ఇసుకరేణువూ ఎంతో గొప్పగా జీవంతో తొణికిసలాడుతున్నట్టు కని పించాయి. నేను భూమికి చెందినవాడిననీ, నేనక్కడేదో దురాక్రమణదారుడినన్న భావన నాలో బలంగా కలిగింది.

కొండపాదతలం చేరుకోగానే మయూరి నాకేసి చూస్తూ, ''నా మాటలు గుర్తుంచుకో. అసలు మాట్లాడకూడదు,'' అన్నది. నేను తల ఊపాను. ఉన్నట్టుండి అక్కడ జలమానవుల మధ్య తాతయ్య, లడ్డూ ఎలా ఉన్నారో అన్న ఆలోచన నాలో మెదిలింది.

''నేను నీకో విషయం చెప్పాలి,'' అన్నాను.

మయూరి నాకేసి చూసింది. ఆమె చూపుల్లో కాసింత అసహనం కనిపించింది.



''మా తాతయ్య, ఆయన కుక్క జలమాన వుల దగ్గర ఉన్నారు. అన్నీ సర్దుకున్నాక నేను వాళ్ళను ఇక్కడికి తీసుకురావాలి,'' అన్నాన్నేను.

''నువ్వేదైనా అడుగుతున్నావా? లేక సమా చారం చెబుతున్నావా?'' అని అడిగింది మయూరి నెమ్మదిగా.

''అది నాకు తెలియదు. వాళ్ళను అక్కడే వదిలి ఉండలేను. అది మాత్రమే తెలుసు,'' అన్నాన్నేను భయం భయంగా.

''ఒక మనిషికన్నా ఇద్దరు మనుషులూ, ఒక జంతువూ పెద్దహాని కాదనుకుంటాను. వాళ్ళను గురించి విచారించకు నాయనా. జలమాన వులు, గౌరవనీయమైన ప్రాచీన జాతికి చెందిన వాళ్ళు. ఇచ్చిన మాట తప్పడం కన్నా వాళ్ళు పూర్తి స్థాయి మానవులుగా మారిపోవడానికే సిద్ధపడతారు,'' అన్నది మయూరి.

''నువ్వు మానవులను అంతగా ఎందుకు ద్వేషిస్తావు?'' అని అడిగాను నేను వెంటనే.

''ఎందుకంటే.. ఎందుకంటే.. గాయాలు.. కొన్ని గాయాలు ఏర్పడతాయి... మరికొన్ని గాయాలు మళ్ళీ పుడతాయి. నీకున్నవన్నీ గాయాలేనని ఒక రోజు నువ్వే తెలుసుకుం టావు. పుట్టకుండా ఉంటేనే బావుండేదని అనుకుంటావు,'' అన్నది ఆమె విచారంగా. ఆ తరవాత కొంతసేపు మౌనంగా ఊరుకుని తలపైకెత్తి, మందహాసం చేస్తూ, ''మాట్లాడుతూ సమయం వృథా చేయకూడదు. మనకోసం యుద్ధమండలి కాచుకుని ఉంటుంది,'' అన్నది.

కొండ మీదికి ఎక్కడం ప్రారంభించాం. దారి ఎగుడు దిగుడుగా ఉంది. పెద్ద పెద్ద బండలు వెన్నెల వెలుగులో మెరుస్తున్నాయి. దారి పక్కన

ఉన్న తీగలను పట్టి లాగాను. మయూరి ఆగ కుండా వెళుతున్నది. మోచేతుల నుంచి జీన్స్ మీదుగా కారిన నెత్తురు చుక్కలను తుడుచు కున్నాను. వేగంగా మయూరివెంట నడవ సాగాను. దారికి ఇరువైపులా మారుతూన్న వింత వింత దృశ్యాలను కూడా పట్టించుకోకుండా ముందుకు నడిచాను. ''ఏకాగ్రత! ఏకాగ్ర దృష్టి! వందశాతం విజయం అందిస్తుంది,'' అనుకున్నాను మా లెక్కల మాష్టారు మాట లను తలుచుకుంటూ. ఆయన బట్టతలను ఉద్దేశించి మేమాయనకు ''మూన్‌షైన్'' అని తమాషా పేరు పెట్టాం. దాన్ని తలుచుకోగానే వచ్చే నవ్వును ఆపుకోవడానికి ప్రయత్నించాను.

కొండమీదికి చేరుకోగానే మొత్తం అనునిర్వ నా కింద ఉండడం చూడగలిగాను. చందమామ మేఘాల చాటున లేదు. తెల్లటి దుప్పటిలా వెన్నెల నేలను కప్పుతోంది. చల్లటి గాలులు నా చేతిని కదిలించాయి. నాలో నిద్రపోయే ప్రాణుల స్వప్న దృశ్యాల్లా ఏవేవో వింతవింత అనుభూ తులు కలిగాయి. నిశీథి నిశ్శబ్దం. నా చుట్టూ జీవం తొణికిసలాడడం నేను గ్రహించాను. ''మయూరీ! యుద్ధమండలిలో ఎవరెవరుంటా రేమిటి?'' అని అడిగాను.

''కాస్సేపట్లో నువ్వే స్వయంగా చూస్తా వుగా,'' అన్నదామె. ఆ తరవాత ఆమె నాలుగు చేతులూ చంద్రుడికేసి పైకెత్తి కళ్ళు మూసు కున్నది. ప్రార్థిస్తున్నట్టు కనిపించింది. అయినా నేను ఒక్కమాట అనడానికి కూడా సాహసించలేక పోయాను. ఆమె కళ్ళు తెరిచింది. మొహంలో ఏదో చెప్పరాని ప్రశాంతత చోటుచేసుకుంది. కొండ పైనుంచి మరోవైపున కిందికి దిగసా గాము. ఇరువైపులా పొదలనుంచి రెండు



మూడుసార్లు ఏవో కళ్ళు మమ్మల్ని చూస్తున్న ట్టనిపించింది. అయినా అవి అప్పటికప్పుడే కని పించకపోవడంతో నిజమా, నా భ్రాంతా అని తేల్చుకోలేకపోయాను. కొండ కిందికి చేరగానే అక్కడ ఓ పెద్ద దిబ్బ కనిపించింది. అదేమిటో పోల్చుకోలేకపోయాను. మయూరిని అడుగు దామని తిరిగాను గాని, ఆమె దేన్నో తీవ్రంగా చూస్తూండడంతో అడగలేక ఊరుకున్నాను.

ఇది మేము ఎక్కవలసిన మరొక కొండ కాదు కదా అనుకుంటూ దిబ్బకేసి నడిచాను. మరీ చల్లగా, పొలుసులు పొలుసులుగా ఉన్న పదార్థం మీద కాలువేసి జారి దిగ్భ్రాంతితో బోర్లాపడి, హడావుడిగా లేచి పరుగులంకించు కోబోయాను. అయితే, మయూరి నవ్వుతూ నన్ను అక్కడే పక్కగా ఆగమని చెప్పింది.

''నైలు మొసలి అది,'' అని ఆమె చెప్ప డంతో నేను దానికేసి ఆశ్చర్యంగా చూశాను. గుండె జారినంతపనయింది. దాన్ని 'బ్రహ్మాండం'

'చాలా పెద్దది' అని చెప్పడం సరికాదు. అది కనీసం పదహారు అడుగుల పొడవు ఉంటుంది. నోరు తెరిస్తే దవడ లోపల విందు ఏర్పాట్లు చేసుకోవచ్చు. మొసలి నన్ను స్నేహంతో పలకరించి, ''నేను ఒకప్పుడు మనుషుల్ని తినేదాన్ని,'' అన్నది. నేను బెదురుతూ నవ్వాను. 'మొసళ్ళ కేసి ఎప్పుడూ నవ్వొద్దు,'' అంటూ మొసలి కళ్ళార్పింది.

ఎలాంటి మర్యాదలు పాటించాలో అంతు బట్టక నేను దానికేసి గుడ్లప్పగించి మౌనంగా చూస్తూండిపోయాను. ఆ తరవాత కొంతసేపటికి మయూరి, ''ఇంకా మరికొందరు కూడా ఇక్కడ ఉన్నారు. నీ కంటికి కనిపించడం లేదా?'' అని అడిగింది. ఆమె మళ్ళీ దిబ్బకేసి చూస్తున్నది. నేను నెమ్మదిగా దానికేసి నడిచాను. ఒక జత తెల్లటి కోరలు. పుచ్చకాయలోకి కత్తిలా భవనంలోకి దూసుకుపోయేంత పదునుగా కనిపించాయి. ''వూలీ మమ్మత్,'' అంటూ ఒక వింత శబ్దం వినిపించింది. ఆ దిబ్బే మాట్లాడుతున్నట్టు గ్రహించాను. అది తనను తాను పరిచయం చేసుకుంటున్నదన్నమాట!



చిన్న పిచ్చుకలాంటి పక్షి పసుపురంగు మమ్మత్ పెద్ద తలమీద కూర్చుని ఉంది. అది ఒక్క గెంతున కిందికి ఎగురుతూవచ్చి మయూరి అరచేతిలో వాలింది. ''ఇదీ మొత్తం యుద్ధ మండలి! లేదా చాలా వరకు ఉన్నాయనాలి. ఇది జలగర్భ సమావేశం కాకపోవడం వల్ల సింధునది డాల్ఫిన్ రాలేకపోయింది,'' అని ప్రకటించింది మయూరి.

''నీ వ్యాజ్యాన్ని వాదించడానికి నువ్విక్కడికి వచ్చావు,'' అన్నది పక్షి. ''మీ జాతి చర్యలను ఖండిస్తూ చాలా సంవత్సరాల క్రితమే మండలి ఒక తీర్మానాన్ని నెరవేర్చింది. మీరు అనునిర్వలో అడుగు పెడితే మిమ్మల్ని క్షమించకూడదని నిర్ణయించడం కూడా జరిగింది.''

''నైలు మొసలి, పక్షి చెబుతున్నది సరైనదే. మిమ్మల్ని తీసుకురావడానికి భూమి మీదికి వచ్చిన మావాళ్ళు మీ పట్ల ఎంతో సానుభూతి కనబరచారు. వాళ్ళు మయూరికి... ఒకరికి...'' అంటూ కాస్సేపు ఆగి తన పెద్ద తోకను గౌరవ సూచకంగా పైకెత్తి నేలకేసి కొట్టింది. ఆ తరవాత, ''నచ్చచెప్పి హాని కలగకుండా మీరు అనునిర్వలో ఉండడానికి అనుమతి పొందారు.''

ఆ తరవాత వూలీ మమ్మత్, ''నిజానికి మిమ్మల్ని మా న్యాయస్థానంలో విచారణ జరపాలి. అయితే, మిమ్మల్ని అక్కడికి తీసుకెళ్ళడానికి మీరు విశ్వాసపాత్రులేనా అని మొదట పరిశీలించాలి. విశ్వాసాన్ని మీరు కలిగించాలి.

అందరి సమక్షంలో నిరూపించుకోవాలి.''

నేను మాట్లాడడానికి నోరు తెరవబోయాను. కాని మయూరి నాకేసి చూడ్డంతో ఆమె హెచ్చరిక జ్ఞాపకం వచ్చి మౌనంగా ఉండిపోయాను.

''ఈ కుర్రాడు నా ఆహ్వానం మీదే వచ్చాడు,'' అన్నది మయూరి మృదువుగా. ''అతడి జాతి హంతకుల జాతి అన్నది వాస్తవమే. వాళ్ళ చేతుల్లోని నెత్తురు వాళ్ళు ఆశ్రయం కోరి అడుగు పెట్టే ప్రదేశాలను సైతం భస్మీపటలం చేయగలవు. వాళ్ళ అపరాధం, వాళ్ళు నాశనం చేయడానికి పూనుకున్న భూగోళమంత భారమైనది.''

ఆమె అభిప్రాయం ఏమిటో నాకు స్పష్టంగా తెలియలేదు. తమ మాటలు నమ్మి మయూరి మమ్మల్ని రక్షించడానికి తప్పక సాయపడగలదని ఓమెన్, లెమన్ దృఢంగా విశ్వసిస్తున్నారు. అయితే, నాకు మాత్రం అంతటి గట్టి నమ్మకం లేదు. మండలిలో ఇతర సభ్యుల కన్నా మన జాతి మీద ఆమెకున్న ఆగ్రహం ఎక్కువగానే ఉన్నట్టనిపించింది.

''అయినా, ఈ నేరాలకన్నిటికీ ఈ ఒక్క కుర్రాణ్ణి మాత్రమే విచారణకు తీసుకోవాలా? ఇతనితో పాటు వయోధికుడైన మరో మానవుడూ, అంటే ఇతడి తాతయ్య, మరో కుక్క ఉన్నట్టు చెబుతున్నాడు...''

''మీరు మా తాతయ్యను ముట్టుకోకూడదు!'' అన్నాను నన్ను నేను మరిచిపోయి.

''అతడెలా నిబంధనలు విధిస్తున్నాడో చూశారా,'' అన్నది నైలుమొసలి. దాని కోరలపై చంద్రకాంతి తళుక్కుమన్నది. దాని కళ్ళు నన్ను గుచ్చిగుచ్చి చూశాయి. దాని బలమైన దవడలు చూస్తూంటే కడుపులో భయం పుట్టుకొచ్చింది.

''ఒకరితో ఇలాగేనా మాట్లాడేది! ఎలాంటి



మట్టూ మర్యాదా లేకుండా!'' అని మందలించింది వూలీ మమ్మత్.

మయూరి అరచేతి నుంచి ఎగిరిపోయి ఒక గుట్ట మీద కూర్చున్న పక్షి, ''ఎలాంటి ప్రయోజనమూ ఉండబోదని చెప్పాను. నేను చెప్పాను ప్రయోజనం లేదని. ఇప్పుడు ఏమైనా ఉపయోగం ఉందా?'' అన్నది.

''నేను చెప్పాలనుకున్నది అది కాదు,'' అంటూ నీళ్ళునమిలాను. ఇతరుల విమర్శల కన్నా మయూరి గంభీర మౌనమే నాలో ఎక్కువ భయం, ఆందోళన రగిలించింది. ఆమె చిరు దరహాసమే నా విధిని నిర్ణయించగలదని నాకెందుకో అనిపించింది. దీన్నంతా ఆమె వినోదంగా పరికిస్తున్నదని గ్రహించాను. ఆమె వాలకం చూస్తుంటే నన్ను కాపాడేలా లేదు. నేను మరణించనున్నాను. *- (ఇంకావుంది)*

- సౌమ్యా రాజేంద్రన్

# బేస్‌బాల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా (బిఎఫ్ఐ)



మీకు బంతి విసరడం పట్ల ఆసక్తి ఉందా? బ్యాటింగ్ చెయ్యాలనుకుంటున్నారా? పరుగులు చేయడం అంటే ప్రాణమా? లేక క్యాచర్‌గా ఫీల్డ్‌లో ఉండాలనుకుంటున్నారా? మనం ఇప్పుడు మాట్లాడుతున్నది క్రికెట్ గురించి కాదు! అమెరికా పాప్యులర్ ఐకాన్‌గా పేరొందిన బేస్‌బాల్ గురించి! అది ఇప్పుడిప్పుడే ఇండియాలో ప్రాచుర్యం పొందుతున్నది. క్రికెట్‌ను పోలిన ఈ క్రీడ పలువురిని ఆకర్షించగలదనడంలో ఏమాత్రం సందేహంలేదు. క్రికెట్ లాగా బేస్‌బాల్‌కు ఇండియాలో ప్రాచుర్యం కలిగించాలన్న ఆశయంతోనే బిఎఫ్ఐ తన కృషిని కొనసాగిస్తోంది.

బేస్‌బాల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా(బిఎఫ్ఐ)ని 2006లో దీపక్ జోషి స్థాపించాడు. భారతదేశంలో ఈ క్రీడకు ప్రాచుర్యం కలిగించడానికి ఆయన మొదట చండీఘర్‌లో బేస్‌బాల్ అకాడెమీని స్థాపించాడు. క్రీడలంటే దీపక్ జోషికి మహాఇష్టం. భారతదేశంలో ఇంకా గుర్తింపు పొందని బేస్‌బాల్, రగ్‌బీ లాంటి క్రీడలను ప్రవేశపెట్టి ప్రోత్సహించినట్టయితే ఇండియా క్రీడల నిలయంగా వెలుగొందగలదని ఆయన భావించాడు. పిల్లలకు బేస్‌బాల్ పట్ల ఆసక్తి కలిగించి, వాళ్ళను ప్రోత్సహించి శిక్షణ ఇచ్చినట్టయితే వాళ్ళను చక్కటి ప్రొఫెషనల్ ప్లేయర్స్‌గా తీర్చిదిద్దవచ్చునన్న ఉద్దేశంతోనే బిఎఫ్ఐ స్థాపించబడింది.

ఈ క్రీడ పట్ల ఆసక్తిగల యువతులను కూడా ప్రోత్సహించాలనే ఉద్దేశంతో ఉమెన్ బేస్‌బాల్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా(డబ్ల్యుబిఎఫ్ఐ) స్థాపించబడింది. వరల్డ్-క్లాస్ కోచెస్‌తో, క్రీడాకారులతో విద్యార్థులకు ప్రత్యేకమైన కోచింగ్ ఇస్తున్న ఇండియాలోని మొట్టమొదటి ఏకైక సంస్థ ఇది. క్రీడలను తమ కెరియర్‌గా తీసుకుని ప్రపంచస్థాయి బేస్‌బాల్ క్రీడాకారిణులు కావాలని కలలుగనే ఉత్సాహవంతులైన యువతులకు గ్లోబల్ ప్లాట్‌ఫారం సమకూరుస్తోంది డబ్ల్యుబిఎఫ్ఐ.

బేస్‌బాల్‌ను నేర్చుకోవాలన్న ఆసక్తిగల పిల్లలకు శిక్షణ, కోచింగ్ ఇవ్వడానికి బిఎఫ్ఐ చండీఘర్‌లోనూ, మోహాలిలోనూ వరల్డ్ క్లాస్

ఇంటర్నేషనల్ బేస్‌బాల్ స్టేడియం నిర్మించ డానికి పూనుకున్నది. ఢిల్లీ, పాటియాలలలో కూడా ఇది పనిచేస్తున్నది.

విద్యార్థులకు బేస్‌బాల్ పరికరాలు తగ్గింపు ధరలకు అందజేస్తోంది. అవసరంలో ఉన్న అర్హులైన క్రీడాకారులకు స్కాలర్‌షిప్స్, యేడా దికి రెండు సార్లు క్యాంపులు, క్లినిక్స్ ఏర్పాటు చేసి ఇంటర్నేషనల్ బేస్‌బాల్ మ్యాచెస్‌లో ఇండియా తరపున పాల్గొనడానికి టీమ్స్‌ను ఎంపిక చేస్తారు.

ఫీజు చెల్లించలేని అర్హులైన విద్యార్థులకు ఉచితంగా బేస్‌బాల్ ట్రెయినింగ్ ఇస్తారు. ఆసక్తి గల విద్యార్థులకు వారాంతాలలో ఉచితంగా కోచింగ్ క్లాసులు నిర్వహిస్తారు.

''20,000మంది క్రీడాకారుల 50మంది కోచ్‌ల క్రియాశీల మద్దతు మాకు ఉంటోంది. విభిన్న వయోపరిమితులు గల విద్యార్థులకు అనుగుణంగా, వారివారి వయసు, క్రీడా పరిజ్ఞానం ప్రాతిపదికగా తరగతులు రూపొందించబడి నిర్వహించబడుతున్నాయి,'' అంటారు డబ్ల్యుబిఎఫ్ఐ ప్రెసిడెంట్ మిసస్ రోసూ బ్రార్.

భవిష్యత్తులో బిఎఫ్ఐ విద్యార్థులకు ఏమేం చేయాలనుకుంటున్నది? అని అడిగినప్పుడు రోసూబ్రార్, ''బేస్‌బాల్ పట్ల ఆసక్తికలిగి ఉంటూ ఆడాలనుకునే ప్రతి ఒక్కరినీ బిఎఫ్ఐ ఆహ్వానిస్తుంది,'' అన్నారు. ప్రతిభాశాలురైన యువకులకు శిక్షణనిచ్చే కోచ్‌లను నియమించే విషయానికి వస్తే బిఎఫ్ఐ అలాంటి వారి నిబద్ధతకు అధిక ప్రాధాన్యతనిస్తుంది. కోచ్‌లకు క్రీడ గురించిన మంచి పరిజ్ఞానం ఉండాలి. అంతకన్నా ముఖ్యంగా పిల్లల మనస్తత్వం తెలిసి ఉండాలి. ఎందుకంటే ఏ క్రీడనైనా నేర్చుకుని, అందులో నైపుణ్యం పెంపొందించుకోవాలంటే కోచ్-విద్యార్థి మధ్య సంబంధం చాలా ముఖ్యమైనది.

బేస్‌బాల్ క్రికెట్టుకు భిన్నమైనట్టే దాన్ని పోలినది కూడా. త్వరలో ఇండియాలో బేస్‌బాల్‌కు ప్రీమియర్ లీగ్ జరగవచ్చు! ఎవరు చెప్పగలరు? మీరు గ్లొవ్స్ తొడుక్కోవడానికి సిద్ధంగా ఉన్నట్టయితే, ఆలస్యం చేయకండి.. వెంటనే బిఎఫ్ఐని సంప్రదించండి!

సమాచారం కోసం:

బేస్‌బాల్ ఫెడరేషన్ ఆఫ్
ఇండియా(బిఎఫ్ఐ),
SCO-52-53, సెక్టార్ 9D,
ఫస్ట్ ఫ్లోర్, చండీఘుర్.
ఫోన్ నం: 0172-4676618
ఇ-మెయిల్: info@baseballindia.net
వెబ్‌సైట్: www.baseballindia.net



# ఉదయ తారలు

# హిరాక్ జ్యోతి నియోగ్



గెలుపొందిన అవార్డులు:

- మొరీషియస్ ఓపెన్ (2009) జూనియర్ సింగిల్స్ ఈవెంట్‌లో విజేత.
- కొచ్చి నేషనల్ ర్యాంకింగ్ టోర్నమెంట్(2008)లో U-19 సింగిల్స్ విజేత.
- డెహ్రాడూన్ సబ్ జూనియర్ నేషనల్స్ (2007)లో కాంస్య పతకం.
- చెన్నయ్ కృష్ణకైతాన్ ర్యాంకింగ్ టోర్నమెంట్ 2007లో U-16బాయ్స్ సింగిల్స్ రన్నర్ అప్.
- సూరత్ U-14 స్కూల్ గేమ్స్(2005) విజేత.
- చెన్నయ్ నేషనల్ ర్యాంకింగ్ టోర్నమెంట్ (2004)లో U-13 బాయ్స్ సింగిల్స్ విజేత.

అస్సాంకు చెందిన పదిహేడేళ్ళ ఛాంపియన్ హిరాక్ తన అభిమాన క్రీడ బ్యాడ్మింటన్ గురించిన చాలా విషయాలను మనతో పంచుకున్నాడు. అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన తన బంధువు కృష్ణదేక రాజా తన స్ఫూర్తి అనీ, తను ఈ క్రీడపట్ల ఆకర్షితుడు కావడానికి ఆయనే కారణం అనీ అంటాడు హిరాక్.

రోజూ ఐదు గంటలు సాధన చేస్తాడు. శారీరక దృఢత్వం ఈ క్రీడకు చాలా ముఖ్యం గనక దానికీ తగిన స్థానం ఇస్తాడు. తన కోచ్ సుబ్రోటో పాధీని గురించి చెబుతూ, ''వృత్తిపట్ల ఆయనకున్న నిబద్ధత, భక్తి, నా పట్ల ఉన్న నమ్మకం అపారమైనవి,'' అంటాడు. ప్రస్తుతం పన్నెండవ తరగతి చదువుతూన్న హిరాక్ చదువుల్లోనూ ముందు ఉంటున్నాడు. బ్యాడ్మింటన్ ఆడడానికి ప్రోత్సహించడంతో పాటు, దానివల్ల ఏర్పడే మానసిక ఒత్తిళ్ళను ఎదుర్కోవడానికి తగిన సలహాలను తన తల్లిదండ్రులు ఇస్తారు అంటాడాయన.

''అందుకు నేను నా తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు కృతజ్ఞతలు చెప్పాలి!'' అంటాడాయన. ఎయిర్ ఇండియా, ఇండియన్ టీమ్‌లలో ప్రాతినిధ్యం వహించడానికి ఎంపికయినందుకు ఆయనెంతో సంతోషం వ్యక్తం చేశాడు.

పుల్లెల గోపీచంద్ అకాడెమీలో చేరి శిక్షణ పొంది ప్రొఫెషనల్ బ్యాడ్మింటన్ క్రీడాకారుడై భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తూ ఆడాలన్నదే తన జీవిత లక్ష్యంగా చెబుతున్నప్పుడు హిరాక్ జ్యోతి నియోగ్ కళ్ళల్లో ఆత్మవిశ్వాసం తొణికిసలాడింది. ఆయన లక్ష్యం నెరవేరడానికి చందమామ శుభాకాంక్షలు తెలియజేస్తున్నది!



# బంగీ జంపింగ్

శరీరంలో అత్యధికంగా అడ్రినలిన్ స్రవింప జేసే ఉద్విగ్నభరితమైన క్రీడ బంగీ జంపింగ్. దీని మూలాలను పరిశీలించామంటే 'వాను వాటూ' యువకులు ఆడే ప్రమాదభరితమైన 'ల్యాండ్ డైవింగ్' అంటే ఎత్తు నుంచి నేల మీదికి దూకే క్రీడ వరకు వెళుతుంది. వీళ్ళు దూకే ఎత్తును బట్టే ఆయేటి యామ్‌దుంప పంట ఉంటుందని అక్కడి ప్రజల విశ్వాసం. ఈ విన్యాసంలో పాల్గొనే యువకుడు 100 అడుగుల ఎత్తు నుంచి కిందికి దూకాలి. మృత్యువును సవాలు చేస్తూ జరిగే ఈ సంప్రదాయ క్రతువును స్థానికులు 'నాఘోల్' అని పిలుస్తారు. దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలో 'వానువాటూ' దీవిలో ఈనాటికీ ఏప్రిల్ నెలలో యువకులు ఈ క్రీడలో పాల్గొంటారు.

ఈ క్రతువుకు ముందు, అప్పుడే నరికిన వెదుళ్ళతో, కలపతో వంద అడుగుల ఎత్తయిన వేదిక ఏర్పాటు చేస్తారు. ఎత్తయిన ఈ వేదికపై నుంచే క్రీడాకారులు కింది నేలమీదికి దూకాలన్నమాట! దూకడానికి చెట్ల తీగలనే తాళ్ళుగా ఉపయోగిస్తారు. తమ పాదాలకు పైన కాళ్ళకు తీగలు కట్టుకుని వీరులు కిందికి దూకుతారు. తాకిడిని తగ్గించడానికి వలలు ఉండవు. పానుపులు ఉండవు. నీళ్ళు ఉండవు. అలా దూకే వీరుడి జట్టు భూమిని సుతారంగా




తాకడాన్నిబట్టి నేలసారవంతమై ఆయేటి యామ్‌పంట ఎక్కువవుతుందని ఆ ద్వీప వాసులు విశ్వసిస్తారు!

బంగీ జంపింగ్ ఆధునికరూపం 1979లో ఆరంభమయింది. డేంజరస్ స్పోర్ట్స్ క్లబ్ సభ్యులైన థ్రిల్లును కోరే డేవిడ్ కిర్క్, మరి ముగ్గురు ఏప్రిల్‌ఫూల్స్ డే నాడు బ్రిస్టోల్‌లోని క్లిఫ్టన్ సస్పెన్షన్ బ్రిడ్జిపై నుంచి కిందికి దూకారు. ఆ తరవాత వారిని పోలీసులు అరెస్టు చేసి 100 పౌండ్లు జరిమానా విధించారు. అయితే రాత్రికి రాత్రే వాళ్ళు ప్రసిద్ధులై సెలిబ్రిటీలై కూర్చున్నారు!



*Images Courtesy: wikimedia commons*

## సంగీత శక్తి

మంచి సంగీతం వినడం ద్వారా మనసుకు ప్రశాంతత లభిస్తుంది. శరీరంలోని కణజాలాన్ని ఉత్తేజపరచి శక్తిని పుట్టిస్తుంది. ఇటీవల జరిపిన కొన్ని అధ్యయనాలు మరో కొత్త విషయాన్ని వెలుగులోకి తెచ్చాయి. నెలలు నిండక మునుపే పుట్టిన శిశువులు బాధను తట్టుకుని, ఆహారం మెరుగ్గా తీసుకుని ప్రశాంతంగా ఉండడానికి సంగీతం సాయపడుతుందని కనుగొన్నారు.

నెలలు నిండకుండా పుట్టిన శిశువులకు బాధలు కలిగించే చికిత్సలు చేయవలసి ఉంటుంది. అలాంటప్పుడు సంగీతం వినిపించడం ద్వారా మెరుగైన ఫలితాలను రాబట్టవచ్చని కెనడాలో జరిపిన పరిశోధనల ద్వారా తెలియవచ్చింది.

## తాపదీప్త దీపాలపై నిషేధం

యూరపులో ఇటీవల 100 వాట్స్ ఇన్‌కాండెస్సెంట్ లైట్‌బల్బ్స్ అంటే వేడి ద్వారా వెలుగు పుట్టించే తాపదీప్త దీపాల తయారీని నిషేధించారు.

100 వాట్స్ బల్బులు, ఫ్రాస్టెడ్ బల్బుల తయారీ నిషేధం-ఇన్ కాండస్సెంట్ బల్బుల నుంచి హాలోజెన్ అంటే ఉదజని మరికొన్ని శక్తిదీప్తదీపాల మార్పుకు తొలి మెట్టుగా భావిస్తున్నారు. ఇది మరో మూడేళ్ళలో పూర్తవుతుంది. చివరగా అంటే 2012 నాటికి అతి తక్కువ వాటేజ్ బల్బుల ఉపయోగాన్ని తగ్గించడానికి ప్రభుత్వాలు చర్యలు తీసుకుంటున్నాయి. కొన్ని ప్రాంతాలలో చట్టం ద్వారానూ, మరికొన్ని ప్రాంతాలలో స్వచ్ఛంద కార్యక్రమాల ద్వారానూ దీనిని నెరవేరుస్తున్నారు.



*Images Courtesy: wikimedia commons*

కాంపాక్ట్ ఫ్లూరస్సెంట్ ల్యాంప్(సిఎఫ్ఎల్), ఎల్ఇడి ల్యాంప్ వంటి శక్తి జనిత(ప్రతిదీప్త) దీప ప్రత్యామ్నాయాలను ఉపయోగించడాన్ని ప్రోత్సహించడమే ఈ నిషేధాల ఉద్దేశం.





# తండ్రి ప్రేమ

ఒకనాటి సాయంకాలం అక్బర్ చక్రవర్తి బీర్బల్‌తో కలిసి యమునా తీరంలో నడుస్తున్నాడు. ఆ సమయంలో దూరం నుంచి గుడిగంటలు వినిపించాయి. ఆ నాదాన్ని వినగానే, ''ఈ గంటలెందుకు కొడతారు? అవి దేన్ని సూచి స్తాయి బీర్బల్,'' అని అడిగాడు చక్రవర్తి.

''మనమందరం దయామయుడైన దేవుడి బిడ్డలం అనీ, దేవుడు అపార కరుణాసింధువు అనీ, మనసారా ప్రార్థిస్తే దేవుడు ఆపదలలో పరిగెత్తుకు వచ్చి ఆదుకుంటాడనీ ఆ గుడి గంటలు సూచిస్తాయి ప్రభూ,'' అన్నాడు బీర్బల్.

''ఆహా! అంటే నువ్వు దేవుడి బిడ్డవన్న మాట!'' అంటూ బీర్బల్ బట్టపట్టి లాగాడు చక్రవర్తి పరిహాసంగా నవ్వుతూ.

''ఇది పరిహాసాలాడే విషయం కాదు ఆలం పనా!'' అన్నాడు బీర్బల్ కాస్త గంభీరంగా.

''అలాగా! ప్రతిభక్తుడి మొరలనూ, ఆర్త నాదాలనూ విని పరిగెత్తుకురావడం కన్నా దేవు డికి మరెన్నో ముఖ్యమైన పనులు ఉంటాయని నేను అనుకుంటున్నాను. ఒక భక్తుడు మొర పెట్టుకుంటే దేవుడు దివి నుంచి భువి మీదికి సరాసరి దిగివచ్చి, భక్తుణ్ణి బాధించి వేధిస్తున్న దుర్మార్గుడి వెంటబడి వాణ్ణి వధించి భక్తుణ్ణి ఆశీర్వదిస్తాడు. ఆ విధంగా దేవుడికి మరొక కొత్త పేరు వస్తుంది. భక్తుడు ఆ పేరుతో దేవుణ్ణి స్తుతి స్తాడు. ఆ విధంగానే కదా విష్ణువు పది అవతా రాలెత్తి పది పేర్లు తెచ్చుకున్నాడు? ప్రతి ఒక్క అవతారానికీ ఒక్కొక్క పేరు పెట్టడం మీకే చెల్లింది,'' అంటూ చక్రవర్తి బిగ్గరగా నవ్వాడు.

''షహేన్‌షా, దేవుడు కరుణాస్వరూపుడు, దయామయుడు. భక్తులైన తన బిడ్డలు బాధల నుభవిస్తూంటే తను ఎలా స్వర్గంలో ప్రశాం తంగా కూర్చోగలడు? మీకు ఇష్టమైనవారి కన్నీళ్ళు తుడవడానికి మీరు పరిగెత్తరా? రాకు మారుడికే ఒక కష్టం వస్తే మీరు చేతులు కట్టు కుని కూర్చోగలరా? వెల్లువలు, కరువుకాట కాలు వచ్చి పడినప్పుడు ప్రజలను కాపాడడానికి మీరు సత్వర చర్యలు తీసుకుంటారు కదా? అదీ ఇలాంటిదే!'' అన్నాడు బీర్బల్ స్పష్టమైన





కంఠస్వరంతో చాలా వినయంగా.

''దేవుణ్ణి మానవుడి స్థాయికి దిగజార్చ వద్దు,'' అన్నాడు చక్రవర్తి వెంటనే.

''దేవుడి సృష్టిలో కంతటికీ మానవుడే ఉత్తమ సృష్టి. అందువల్ల ఒక తండ్రిలా దేవుడు తన సృష్టిని సదా సర్వవేళలా అత్యంత ప్రేమతో కాపాడుకుంటాడు,'' అని వాదించాడు బీర్బల్.

''నువ్వు ఎన్నయినా చెప్పు. సాయం కావలసినప్పుడల్లా దేవుడు భూమి మీదికి దిగి రావడానికి సిద్ధంగా ఉంటాడనడం నాకెందుకో నమ్మశక్యం కావడం లేదు,'' అని ఆ చర్చకు అంతటితో ముగింపు పలికాడు చక్రవర్తి.

బీర్బల్ మాత్రం ఆ విషయం గురించి చాలాసేపు తీవ్రంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. అప్పటికప్పుడే బయలుదేరి నగరంలో పేరుగల ఒక శిల్పకారుణ్ణి కలుసుకుని, ''మన చక్రవర్తి కుమారుడు మూడేళ్ళ సలీం విగ్రహం ఒకటి కావాలి. తేలిక పదార్థంతో విగ్రహం అచ్చు గుద్దినట్టు యువరాజును పోలి ఉండాలి. దానిని తయారు చేయడానికి నువ్వు కోరిన ధనం ఇస్తాను,'' అని చెప్పాడు.

''నా శక్తి మేరకు ప్రయత్నిస్తాను. అయితే అందుకు ఒకనెల రోజులు పట్టవచ్చు. నెల తరవాత వచ్చారంటే విగ్రహం సిద్ధంగా ఉంటుంది,'' అని మాట ఇచ్చాడు శిల్పకారుడు.

ఒక నెల గడిచిపోయింది.

యథాప్రకారం బీర్బల్ ఆ రోజూ రాజసభకు వెళ్ళాడు. ఆయన్ను చూడగానే, ''బీర్బల్ ఇవాళ పౌర్ణమి. ఈ రాత్రి మనమిద్దరం కలిసి నదీ విహారానికి వెళదామనుకుంటున్నాను. పడవను నదీ మధ్యంలో లంగరువేసి, అక్కడి నుంచి పున్నమిరేయి అందచందాలను తిలకిద్దాం. అద్భుతంగా ఉంటుంది,'' అన్నాడు అక్బర్ చక్రవర్తి.

''షహేన్‌షా! అద్భుతమైన ఆలోచన! మనతో పాటు యువరాజును కూడా తీసుకువెళితే చందమామను చూసి ఆనందిస్తారు కదా? పడవ నదీ జలాలలో ముందుకూ వెనక్కూ ఊగుతూ వెళుతూంటే యువరాజు మరీ ఆనందించగలరనుకుంటాను,'' అన్నాడు బీర్బల్.

''చాలా మంచి ఆలోచన. దాన్ని గురించి నేనెన్నడూ ఆలోచించనేలేదు,'' అంటూ మెచ్చుకుని సరేనన్నాడు చక్రవర్తి.

తొమ్మిది గంటలకల్లా వస్తానని చెప్పి సెలవు పుచ్చుకుని బయలుదేరాడు బీర్బల్. తిన్నగా శిల్పకారుడి ఇంటికి వెళ్ళి తలుపుతట్టాడు.

తలుపు తీసిన శిల్పకారుడు, ''నమస్తే బీర్బల్ జీ! రండి,'' అంటూ ఆయన్ను లోపలికి తీసుకెళ్ళి, గుడ్డ తెరను తొలగించి మూలలో

ఉన్న అందమైన యువరాజు సలీం విగ్రహాన్ని చూపించాడు.

"చాలా బావుంది మిత్రమా! విగ్రహం అచ్చంగా యువరాజులాగే ఉంది," అని మెచ్చుకుంటూ, బీర్బల్ శిల్పకారుడికి అనుకున్న మొత్తం ఇచ్చాడు. ఆ తరవాత విగ్రహాన్ని భుజాల మీదికెత్తుకుని అక్కడి నుంచి బయలుదేరాడు.

కొంతసేపటికి దాపులనున్న నదీ తీరాన్ని చేరుకుని, రాజుగారు పయనం చేసే పడవను గుర్తించాడు. అక్కడున్న కాపలాభటుడు బీర్బల్‌కు నమస్కరించాడు.

"పడవ నడిపేవాళ్ళ నాయకుడెక్కడ?" అని అడిగాడు బీర్బల్.

ఆ మాట వినగానే కొద్ది దూరం అవతల నిలబడ్డ పడవవాడు పరుగున వచ్చి బీర్బల్‌కు చేతులు జోడించాడు.

"దీన్ని తీసుకెళ్ళి రాజుగారి పడవ ముందు భాగం మూలలో పెట్టు," అని విగ్రహాన్ని అందించాడు బీర్బల్.

పడవవాడు దాన్ని జాగ్రత్తగా తీసుకున్నాడు. బీర్బల్ కృతజ్ఞతలు చెప్పి తిరిగి వచ్చాడు.

రాత్రి ఎనిమిదన్నర కల్లా బీర్బల్ రాజభవనానికి చేరుకున్నాడు. అప్పుడు చక్రవర్తి, కొడుకు సలీంతో ఆడుకుంటున్నాడు. తలెత్తి బీర్బల్‌ను చూడగానే చక్రవర్తి, "వచ్చేశావా. ఇప్పుడే బయలుదేరుదాం," అన్నాడు.

చక్రవర్తి, యువరాజు సలీం, బీర్బల్ ముగ్గురూ రథంలో నదీ తీరాన్ని చేరుకున్నారు. ఆ తరవాత పడవలోకి ఎక్కి ముందుభాగంలో కూర్చున్నారు. వెనక వైపు యువరాజు అవసరాలు చూసుకునే నౌకరు కూర్చున్నాడు. రాజాజ్ఞ కాగానే, పడవవాళ్ళు తెడ్లు అందుకున్నారు. ఒకసారి ముందుకూ వెనక్కూ ఊగిన పడవ ఆ తరవాత అల్లనల్లన నదీ జలాలలో హాయిగా ముందుకు వెళ్ళసాగింది.

అక్కడక్కడ తెల్లటి మేఘాలు తేలుతూన్న తూరుపు వినీలాకాశంలో వెన్నెలలు వెదజల్లుతూన్న చందమామను చూసి చక్రవర్తి, "ఆహా! అద్భుత వాతావరణం! అత్యద్భుత సౌందర్యం! స్వర్గం అంటే ఇదే," అన్నాడు ఆనందాతిరేకంతో.

బీర్బల్ తల ఊపాడు. కొంతసేపు అటూ ఇటూ చూస్తూ ఆడుకున్న యువరాజు ఆ తరవాత నిద్రవస్తున్నట్టు ఆవులించసాగాడు. దానిని గమనించిన బీర్బల్ చక్రవర్తికి చెప్పాడు. చక్రవర్తి యువరాజును సుతారంగా ఎత్తుకుని పడవ వెనక భాగంలో అమర్చిన అందమైన మెత్తటి పడకకేసి వెళ్ళాడు.

బీర్బల్ వెంటనే వెళ్ళి మూలలో దాచిన



విగ్రహం మీది బట్టను తొలగించాడు. ''చక్రవర్తి ఇటురాగానే ఈ విగ్రహాన్ని నీళ్ళలోకి తోసే యండి. ఇది చక్రవర్తి ఆజ్ఞ,'' అని పడవ నడిపే వాళ్ళతో చెప్పి వెనక్కు వచ్చేశాడు.

తిరిగివచ్చిన చక్రవర్తి దృష్టి విగ్రహం మీద పడింది. దాన్ని చూడగానే పడకపై పడుకున్న సలీం ఇంతలో ఇక్కడికెలా వచ్చాడు? నీళ్ళలోకి తొంగి చూస్తున్నాడేమిటి? అనుకుంటూన్నం తలో పడవ వాళ్ళు విగ్రహాన్ని నీళ్ళలోకి తోసే శారు.

చక్రవర్తి దుఃఖావేశంతో ఊగిపోతూ ఒక్క గెంతున అక్కడికి దూకి, ''బిడ్డా! బిడ్డా!'' అంటూ నీళ్ళలోకి ఉరకబోయాడు.

బీర్బల్ చక్రవర్తి చేయి పట్టుకుని ఆపి, ''ఆలంపనా! యువరాజు పడకపై నిద్రపోతు న్నాడు,'' అన్నాడు.

''ఇప్పుడే పడవవాడు నా బిడ్డను నీళ్ళలోకి తోసేయడం చూశాను కదా? మూర్ఖుడా! వాణ్ణేం చేస్తానో చూడు. సజీవంగా సలసలకాగే నూనె భాండంలో వేయించేస్తాను,'' అంటూ బాధతో విలపించసాగాడు చక్రవర్తి.

''అది యువరాజు కాదు ప్రభూ. ఆయన రూపంలో కనిపించే విగ్రహం మాత్రమే! యువ రాజు హాయిగా నిద్రపోతున్నాడు. అదిగో అక్కడ చూడండి,'' అంటూ సలీంను చూపాడు బీర్బల్.

దాంతో మామూలు స్థితికి వచ్చి నిట్టూర్చిన చక్రవర్తి, ''మరి ఈ వెధవ పనంతా చేయిం చిందెవరు?'' అని ఉరిమాడు కనుబొమలు ముడిచి.

''శాంతించండి, ప్రభూ! తమరు క్షమిస్తా నంటే అసలు విషయం చెబుతాను. ఒక నెల క్రితం తమరు-ప్రతి భక్తుడి మొర ఆలకించి దేవుడు పరుగెత్తుకు రావడం అన్నది మరీ నమ్మశక్యం కాని అసంబద్ధం అని అన్నారు. జ్ఞాపకం ఉంది కదా? కన్నబిడ్డకు ఆపద అని తెలియగానే ముందు వెనకలు ఆలోచించకుండా నదీ జలాల్లోకి దూకడానికి తమరే సిద్ధపడ్డారు కదా? తమ బిడ్డ కోసం తమరు అంత పని చేయడానికి ఉద్యుక్తులయినప్పుడు, మనం కష్టాల్లో ఉన్నప్పుడు మొరపెట్టుకుంటే మన అందరి తండ్రీ, సర్వశక్తిసమన్వితుడూ అయిన దేవుడు పరిగెత్తుకు రావడంలో ఆశ్చర్యం లేదు కదా?'' అన్నాడు బీర్బల్ చేతులు జోడించి చిన్నగా నవ్వుతూ.

''ఇదంతా నీ పనేనా? హారి పిడుగా! నీ మాట నిరూపించుకోవడానికి ఏమైనా చేయగల సమర్థుడివి బీర్బల్ నువ్వు!'' అంటూ చిన్నగా నవ్వాడు చక్రవర్తి.

మళ్ళీ ఇరువురూ తమ ఆస నాలలో కూర్చుని ఆకాశ వీధిలో వెన్నెలలు వెదజల్లుతూ వెండి కలశంలా సాగుతూన్న జాబిల్లి కేసి ఆనందంతో చూడసాగారు!




భయమెరుగని
నలుగురు
పోగొట్టుకున్న
బంగారు గొలుసు - 3
చిత్రాలు: గాంధి అయ్యి
వాళ్ళు వివరంగా చెప్పిన విషయాన్నంతా ఉమతండ్రి ఓపిగ్గా విన్నాడు.
నేను మంగమ్మతో మాట్లాడతాను.
ఉమా, అనుమానాస్పద వ్యక్తి ఎవరైనా ఇటువైపు రావడం చూశాడా అని తోటమాలిని అడుగుదాం...
అవును. లేకుంటే పోయిన గొలుసులను తిరిగి రాబట్టుకోవడం కష్టం.
లేదు... ఉమ తల్లిగారి అనుమతి పొందనిదే నేనెవరినీ లోపలికి అనుమతించను.
ఇంట్లోకి ఎవరైనా రావడం నువ్వు చూశావా?
వాళ్ళు తోటమాలి పాకవద్దకు వెళ్ళారు. ఉమ తండ్రి అతనితో మాట్లాడాడు.
అయ్యా... శ్యామ్‌బాబు కాలేజీకి వెళ్ళినట్టు నేను అనుకోవడం లేదు.
గదిలో ఎవ్వరూ లేరు. ఉమ బడికీ, శ్యామ్ కాలేజీకీ వెళ్ళిపోయారు.
ఏమిటీ?



ఆయన మార్కెట్లో ఎవరితోనో మాట్లాడుతూ కనిపించాడు.
నిజంగానా? శ్యామ్ తరగతులకు ఎందుకు హాజరు కాలేదు?
ఇక్కడ ఏం జరుగుతున్నదో నాకేమీ అర్థం కావడం లేదు.
మీరు నాతో లోపలికి రండి. నేను శ్యామ్‌తో మాట్లాడుతాను.
అలాగే... బాబూ!
శ్యామ్ ఇంటికి తిరిగివచ్చినప్పుడు తండ్రి ముభావంగా ఉండడం చూసి ఆశ్చర్యపోయాడు.
మార్కెట్లో ఎవరితో మాట్లాడుతున్నావు శ్యామ్?
నేను అన్నీ మీకు చెప్పాలనే అనుకున్నాను నాన్నా.
ఆ మనిషి స్వల్పకాలంలో ఎక్కువ డబ్బు సంపాదించే మార్గం చెబుతానన్నాడు.
ఎలా?
ఆన్‌లైన్ బిజినెస్ నాన్నా! కొద్దిపాటి పెట్టుబడి మాత్రమే చాలునన్నాడు.
మరి, ఆ కొద్దిపాటి పెట్టుబడి ఎలా ఇవ్వాలనుకుంటున్నావు?


ఉమ బంగారు గొలుసును అమ్మేద్దామనుకున్నాను. దాన్ని అమ్మిపెట్టడానికి సాయపడేందుకు ఒకావిడకు డబ్బిచ్చాను.
నేను నమ్మలేకుండా ఉన్నాను. ఇలాంటిపని నువ్వెలా చేశావు శ్యామ్?
నన్ను క్షమించండి. ఆ తరవాత ఉమకు గొలుసులు కొనవచ్చనుకున్నాను.
మంగమ్మ మీద అనుమానంతో మేము ఆమెను నిందించగలమని తెలియదా?
ఇలాంటి మూర్ఖపు పని చేయడం కన్నా నువ్వు మరేదైనా ఆలోచించి ఉండవలసింది.
అందువల్ల నువ్వు రెండో గొలుసు కూడా ఎత్తుకు పోయావు!
మాటిచ్చినట్టు అతడేదీ చేయలేదు.
నాన్నా, అతడు నన్ను ఇంకా మరింత డబ్బు అడుగుతున్నాడు.
ఆ విషయం గురించే నువ్వతడితో ఈ రోజు వాదిస్తున్నావా?
రా, మనం వెళ్ళి ఆ మనిషిని చూద్దాం.
ఇలాంటి మోసం గురించి సుధీర్ అంకుల్ చెప్పగా విన్నాం... మీరాయనతో మాట్లాడండి అంకుల్.



ఉమ తండ్రి, సుధీర్‌తో ఫోన్లో మాట్లాడాడు.
సార్, అతడు పెద్ద మోసగాడు. నేను అక్కడికి వస్తాను.
త్వరలోనే సుధీర్ అంకుల్ అసిస్టెంట్ కమిషనర్‌తో అక్కడికి వచ్చాడు.
శ్యామ్, అతడి దగ్గరికి వెళదాం పద. అతణ్ణి సులభంగా పట్టుకోగలం.
వాళ్ళు మార్కెట్టుకు వెళ్ళారు.
మేమిక్కడే ఉంటాం. నువ్వెళ్ళి అతనితో మాట్లాడు శ్యామ్.
శ్యామ్ వెళ్ళి అతనితో మాట్లాడుతూండగా తక్కిన వాళ్ళు గమనించసాగారు.
అవును. అతడే నేను వెళ్ళి ఖైదు చేస్తాను.
పోలీసును చూడగానే ఆ వ్యక్తి పరుగులంకించుకున్నాడు.
తొందరగా, జోజో.. అతణ్ణి ఆపు.
త్వరలో...
డబ్బుతో పారిపోవడానికి పథకం వేశావు, అవునా?
పిల్లలూ, మీకందరికీ కృతజ్ఞతలు.
శ్యామ్, నువ్వు సరైన గుణపాఠం నేర్చుకున్నావనుకుంటాను.
(అయిపోయింది)

# ప్రకృతి సిద్ధంగా శక్తివంతులవ్వండి!!

కొబ్బరి నీళ్ళు, ప్రోటీన్లు, యాంటి - ఆక్సిడెంట్లు, విటమిన్లు, ఖనిజ లవణాలు మరియు
చక్కెర మొదలగు పోషకాలు కలిగియుండుటవలన మీరు సేవించడానికి ఒక అత్యుత్తమ
సహజసిద్ధమైన పానీయము

ప్రకృతి పరంగా బ్రహ్మాండమైన రుచిని సొంతం చేసుకున్న "కొబ్బరి నీరు" స్వచ్ఛమైన చక్కటి రుచితో
మరి ఏ ఇతర పానీయానికి సాధ్యపడని విధంగా వేసవి కాలంలో ఉష్ణోగ్రతను తగ్గించి,
మిమ్మల్ని ఉత్సాహపరచి మీలో చైతన్యాన్ని తెస్తుంది.

**వెళ్లండి! ప్రకృతి పరంగా సాగండి! కొబ్బరి నీరు దిశగా!**

Coconut Development Board
(Ministry of Agriculture, Government of India)
cdbkochi@dataone.in. www.coconutboard.gov.in

CHANDAMAMA (Telugu) November 2009 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11






# బుబ్బా జట్టు సాహసాలు




కాలేజీ క్యాంటీన్‌లో ఇద్దరబ్బాయిలు, ఇద్దరమ్మాయిలు తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

ఇప్పుడేం చెయ్యాలి? పదిహేను నిమిషాల్లో ప్రదర్శన ప్రారంభమవుతుంది. మనకు ఒక డ్యాన్సర్ తక్కువగా ఉన్నాడు.

ఇంత తక్కువ వ్యవధిలో మనకెవరూ లభించే అవకాశం లేదు.

అందుకే మనం నలుగురు మాత్రమే ప్రదర్శననిద్దాం.

ఏం తమాషా చేస్తున్నావా? అది ఏమాత్రం బాగుండదు. మనం ఎంపిక కాము!

అబ్బాయిలూ, ఇప్పుడు రిలాక్స్ అవుదాం. సరేనా? మనకు ఐదో డ్యాన్సర్ కావాలి. అంతే కదా? అతణ్ణి పట్టుకోవడం అంత కష్టం

అయితే, ఎలా?

అనిల్ గనక ఇక్కడ ఉన్నట్టయితే ఇలాంటి సమస్య వచ్చేది కాదు.

వాణ్ణి గురించి ఏమంటారు?

బావున్నాడు. చేతులమీద స్టైయిల్ టాటూ పెట్టుకున్నాడు.

అతణ్ణి అడిగి చూద్దాం!

బుబ్బా అక్కడ ప్రత్యక్షమయ్యాడు...

ఈ టాటూలు తీసుకుని మీరూ అతణ్ణి తోడు చేసుకోవచ్చు.

థ్యాంక్స్ బుబ్బా.

తమ చేతుల మీద స్టైయిల్ టాటూలు పెట్టుకుని, ఐదుగురూ వేదికమీద 'పైరేట్ డ్యాన్స్' చేశారు.

డ్యాన్స్ ప్రదర్శన ముగిశాక...

ప్రతి రెండు బుబ్బాలూలతో ఒక స్టైయిల్ టాటూ ఉచితంగా పొందండి!